*Ithihasa parisodhakamala - 16*

# INFLUENCE OF ENGLISH EDUCATION ON THE INDIAN SOCIETY

## GOLDEN SAYINGS

"*If India grew up and forgot the foreign languages, notably English — no matter how cultured they were in Hindi, Bengali, Tamil, Telugu — undoubtedly it will become second rate.*"

—Hon. Pandit Nehru

"*It would have been better if the English language also had been included in the list of languages recognised in the Indian constitution.*"

—Hon. Pandit Nehru in Hyderabad

"*I am a lover of the English language and the English. I hold its knowledge as a second language to be indispensable for specified Indians.—I regard the English language as an open window for peeping into western thought and sciences.*"

— Gandhiji in Harijan D. 1—2—42

"*For the present and for a good no. of years to come English would have to be the language it had been for many decades. Those who pressed for English at this stage of our evolution were as nationalistic in their outlook — even more nationalistic — than those who believed in short cuts to progress.*"

—Dr. A Lakshmanaswamy Mudaliar

"*We want to stop the wanton destruction of a national asset.*"

—Sir Mirza Ismail

*By*

KODALI LAKSHMINARAYANA, B. A., (C. T. C.)

# పరిచితి

1947 వ సంవత్సరములో ఆంగ్లవిద్యపై నొక చిన్న పుస్తకమును ఆంగ్లేయ భాషలో వ్రాసితిని. అప్పటినుండి ఈ పుస్తకమును తెలుగులో వ్రాసి, ముద్రించవలెనని తలంచుచుంటిని. నా చిరకాలమనోరథము నేటికి సిద్ధించినది. బొంబాయి విశ్వవిద్యాలయములో ఎం.ఏ., పరీక్షకొక సంవత్సర మీ ప్రశ్న యీయబడినది. ఆంగ్లభాషా ప్రాముఖ్యతను నేడు చాలమంది గుర్తించిరి. 1957 జనవరి 30 వ తేదీన గుంటూరు హిందూకళాశాలలో విద్యార్థి యూనియన్ వారు జరిపిన సాంస్కృతిక వారోత్సవములలో శెక్రటరీ షెరీఫ్ గారి ఆహ్వానముపైన వెళ్లి చరిత్రపై ఉపన్యసించితిని. 1956–57 సం. హిందూకాలేజి సంచికలో నిట్లున్నది. "శ్రీ కొడాలి లక్ష్మీనారాయణగారు చరిత్రలో ముఖ్య ఘట్టములు, మానవజీవితముపై వాటిప్రభావముగూర్చి ఉపన్యసించిరి." నేనొసంగిన ఉపన్యాసము అధికభాగము ఈగ్రంథములోనిదే.

చారిత్రక సత్యాన్వేషణ చాలకష్టమైనపని, అయినను వ్యయప్రయాసలను లెక్కించక, బౌద్ధ జైన గ్రంథముల కొరకు, కాశి, సారనాథ్ ల లోని గ్రంథాలయములకు నాల్గుసార్లును, మదరాసు, నెల్లూరు గుంటూరు, విజయవాడ, రాజమండ్రి, హైదరాబాదు పట్టణములలోని గ్రంథాలయములకు పెక్కుపర్యాయములేగి, బహుళ గ్రంథావలోకనము చేసి, అనేకశాసనములు బరిశోధించి, అముద్రిత గ్రంథముల బఠించి వచ్చితిని. ఇంగ్లీషు, హిందీలోని పెక్కుగ్రంథములను స్వయముగా చెప్పించుకొంటిని. మొత్తమీకార్యమునకు దఫాలువారీగా 5000 రూప్యములు వ్యయము చేసితిని. ఈకృషికి తోడ్పడినవారిలో శ్రీ గోగినేని వెంకట సుబ్బయ్యనాయుడుగారు ముఖ్యులు. వీరు ధర్మకార్యములకు కొన్నిలక్షలు రూ.లు ధర్మముచేసిరని పెద్దలుపల్కుదురు. ఇంకను శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరిగారు, శ్రీ గోరంట్ల రాఘవయ్యగారున్నూ మాకుతోడ్పడిరి. రామచంద్రపురము తాలూకా పామఱ్ఱు, కూళ్ల, వాకతిప్ప, తామరపల్లి, పానంగిపల్లి, అనుజూరు, కపిలేశ్వరపురము, టేకి, గంగవరము గ్రామములలోని మిత్రులు ఎప్పుడుప్రచురించిన గ్రంథముల నపుడే తీసుకొనుచుండిరి. మాసారస్వతమును దూరదూర ప్రాంతములలో వ్యాప్తి చేసి త్వరితగతిని నూత్నగ్రంథప్రచురణకు అవకాశములు కల్పించి, శీఘ్రముగా మా పరిశోధక గ్రంథములన్నిటిని ఆర్. జి. భాండార్కరు సంపుటములవలె ముద్రించుడని నిరంతరము ప్రోత్సహించు మిత్రులు, సాహితీకేంద్ర నిర్వాహకులు శ్రీ ముమ్మనేని చలపతిరావుగారికి, మిగత పెద్దలకు మా వందనములు.

—గ్రంథకర్త

# 'విస్మృత ఆంధ్రనాయకుల చరిత్ర'పై అభిప్రాయములు

ఆంధ్రదేశ చరిత్ర మొత్తం భారతదేశ చరిత్రలో అతిప్రాచీనమైన ముఖ్యమైన భాగంగా పేర్కొనవచ్చు. ఆంధ్రుల చరిత్రలో రెడ్డి రాజుల పాలన, కమ్మ, వెలమ, తెలగనాయకుల పాలన సుప్రసిద్ధమైనది.

కాకతీయుల పతనానంతరం ఆంధ్రదేశాన్ని ముస్లింలనుంచి విముక్తి చేసి, వారిని పారద్రోలడానికి ఒక స్వాతంత్ర్యోద్యమాన్ని లేవదీసినది ముఖ్యంగా కమ్మనాయకులే. కమ్మనాయకులు ముస్లిములతో ఎన్నో యుద్ధాలు చేశారు.

కృష్ణదేవరాయల కాలంలో గండికోట ప్రభువుగా పదివేలమంది కమ్మ సైనికులకు నాయకుడుగా పెమ్మసాని రామలింగప్ప నృపాలుడు పేరుపొందినాడు.

ఉత్తర భారతావనినుంచి దక్షిణా పథానికి ఆర్యులు వలసవచ్చినది మొదలు కాకతీయాంధ్ర రాజుల కాలంలో విజయనగర రాజులకాలంలో కమ్మనాయకులు ఏవిధంగా దేశపరిపాలన, రక్షణలతో విపుల బాధ్యతలను నిర్వహించినదీ, చారిత్రకశాసనాధారాలతో వివరించబడిన ఉత్తమ పరిశోధన గ్రంథమిది.

ఇతిహాస పరిశీలకులు శ్రీ లక్ష్మీనారాయణగారు ఈ గ్రంథ రచనకు చేసినకృషి మెచ్చతగ్గది. 10-2-57 —— ఆంధ్రప్రభ.

.........

ఉత్తర భారతవర్షమునుండి దక్షిణాపథమునకు వలసవచ్చిన ఆర్యులలో ఒక తెగ కూర్మిలు; వారు రాజ్యపాలనచేత క్షత్రియులైరి. వారి వంశీకులుకూడ అనగా రెడ్డి, కాపు, తెలగ, కమ్మలు క్షత్రియులే—

ఇది అనేకములైన శాసనాలు చరిత్రలు, పురాణాలూ పరిశోధించి ప్రాచీన చరిత్రకారుల వ్రాతలలోని విపరీతభావాలను, వింతనిర్ణయాన్ని సోపపత్తికంగా ఖండించి సప్రమాణంగా మృదుపదపద్ధతిలో తనవాదాన్ని ఋజువుచేసుకొని కమ్మవారి పుట్టు పూర్వోత్తరాలను సమగ్రంగా, ఉదారంగా తెలిపే చరిత్రగ్రంథము; ఈగ్రంథరచనలో లక్ష్మీనారాయణగారి చారిత్రక విషయ వివేచనాప్రతిభ సర్వవిధాలా శ్లాఘ్యమైఉంది. అడుగడుగునా శాసనాలూ, చరిత్రలూ, ప్రమాణాలూ వచ్చి లక్ష్మీనారాయణగారి వాదాన్ని, పరిశోధనా పటిమనూ మనచేత ఔననిపించుతూ ఒప్పించుతూ మనచేత మెప్పించుతాయి. కాదనడానికి వీలులేని వ్రాత. దీనివల్ల ఆంధ్రదేశంలో కమ్మవారి ప్రాచీనత, ప్రాభవం ఎల్లాఉందేదో నిర్దుష్టంగా తెలుసుకోవచ్చు. ఉత్తమమైనకృషి. 3-3-1957 – ఆంధ్రపత్రిక

# భారతీయ సమాజముపై ఆంగ్లవిద్యా ప్రభావము

## 1

## ప్రాచీన విద్యావిధానము

భారత వర్షము అత్యంత తత్త్వశాస్త్ర సంబంధమగు దేశమని ఒకవిద్వాంసుడు నుడివినాడు ("India is the most philosophical country in the world") ఇండియా మత తత్త్వశాస్త్ర దేశమే కాని శాస్త్రజ్ఞానముగల దేశముకాదని 'దత్తా' వ్రాసెను. (India was never a country of science but a country of religion and philosophy.) ఇది సత్యముగానే యున్నది. పాఠశాలలలో గాని, విశ్వకళాపరిషత్తులలోగాని, చెప్పెడివిద్య అధికముగా మతమునకు, తత్త్వశాస్త్రమునకు సంబంధించియుండెడిది. భౌతిక సంబంధమగు శాస్త్రములకు, చరిత్ర, భూగోళములకు, విచారణ, విమర్శన, ఐహికసంబంధ విషయములకు ప్రాధాన్యత కాన్పించదు. అన్ని శాస్త్రములకు తల్లియైన చరిత్ర శాస్త్రీయ దృక్పథములో బోధించిన గురువులు లేరు. సాహిత్యమునకు చరిత్ర, చరిత్రకు భూగోళము, మార్గమును దయారుచేయును. "చారిత్రక సత్యమును తెలిసికొన్నచో నీవు స్వతంత్రుడ వగుదువు" అను విషయము పాఠశాలలలో నాచరణలో లేదు. ఆకాలపు సత్యము పరమాత్మనుగూర్చి

యేర్పడియున్నది. మానసిక దాస్యము వదలునట్టి, వెఱ్ఱిభక్తి, మూఢనమ్మకముల బోగొట్టునట్టి సర్వవిషయ జ్ఞానము (Liberal education) ప్రాచీన భారతీయ పాఠశాలలలో, కళాశాలలలో గాన్పించదు. ఒక శాఖలో నఖండపాండిత్యము గాన్పించిన, మిగతశాఖలన్ని శూన్యము. విమర్శనాపూర్వక మైన శాస్త్రజన్య జ్ఞానముతో గూడిన ఆలోచన, భావసంపద (Scientific and critical thinking) విచారణ (A spirit of inquiry) పూర్వకాలపు చదువులలో లేవు. మొదట వైదికభాష, తర్వాత సంస్కృతము రాజభాషలుగా నుండెను. మన పాఠశాలలవలె గురుకులములు, విశ్వవిద్యాలయములవలె పరిషత్తులు వేదకాలములో వర్ధిల్లుచుండెను. బృహదారణ్యకోపనిషత్తునుబట్టి శ్వేతకేతువు పాంచాలదేశ పరిషత్తు కేగినట్లు కాన్పించుచున్నది. 'ప్రవాహణజైవాలి' నిత్యము పరిషత్తుల కేగుచుండెను. ఒక్కొక పరిషత్తులో 21 మంది అధ్యాపకులుందురని 'మాక్సుముల్లరు' వ్రాసెను. ముగ్గురు నలుగురున్న 'పరిషత్తు' అగునని 'పరాశరుడు' వ్రాసెను. వేదకాలములో 'కురు, పాంచాల, విదేహ, మత్స్య, ఉశీనర, తక్షశిల, కాశీ ఆది ప్రదేశములలో విద్యాలయములు లేక పరిషత్తులుండెను. ఈ పరిషత్తులగూర్చి గౌతముడు, వశిష్ఠుడు మున్నగువారు వ్రాసిరి. క్రీ. పూ. 9 వ శతాబ్దములో నైమిశారణ్యములో అనేకమంది ఋషులు, శిష్యులు గూర్చుండి యజ్ఞములు చేయుచు, పుణ్యకథల వినుచు విద్యల జదువుకొనుచు కాలక్షేపము చేసిరి. క్రీ. పూ. 7 వ శతాబ్దములో తక్షశిలా విశ్వవిద్యాలయము ప్రసిద్ధిగాంచెను. అప్పటినుండి ఈ విద్యాలయము క్రీ. శ. 3 వ శతాబ్దమువరకు అనగా 1000

వర్షములు వర్థిల్లెను. చారిత్రక విద్యాలయములలో నిది మొదటిది. డా. బారువా, అశోకుని కాలమున 84000 పాఠశాల లుండెనని వ్రాసెను.

వేదకాల పరిషత్తులలో పాఠ్యప్రణాళిక ఈ క్రిందివిధముగా నుండెను. నాల్గువేదములు, రాశి, దైవ, నిధి, వాకోవాక్యం. ఏకాయనం, దేవవిద్య, బ్రహ్మవిద్య, భూతవిద్య, క్షాత్రవిద్య, నక్షత్రవిద్య, సర్ప, దేవ జనవిద్యలు. ఈవిషయము ఛాందోగ్యోపనిషత్తు సప్తమోధ్యాయముప్రథమ,ద్వితీయ ఖండములబట్టి తెలియుచున్నది.[1] ఇది నారద, సనత్కుమార సంవాదము. వేదాధ్యయనము అనగా సంహితలు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, గృహ్య సూత్రములు, షడంగములు అనగా శిక్ష, ఛందస్సు, వ్యాకరణము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, ఇవికాక షడ్దర్శనములు—కపిలుని సాంఖ్యము, పాతంజలి యోగశాస్త్రము, జైమిని పూర్వమీమాంస, బాదరాయణుని ఉత్తర మీమాంస, గౌతముని న్యాయశాస్త్రము, కణాదుని వైశేషిక సూత్రములు, చెప్పబడుచుండెను. వాత్స్యాయన కామసూత్రములలో 64 విద్యల పేర్లున్నవి. వీనిలో వృత్తి విద్యలుకూడ కలవు.

తక్షశిలా విద్యాలయములో 16 విషయములు లేక శిల్పములు చెప్పబడు చుండెను. ఈ ప్రణాళికలో ఆయుర్వేదము, ధనుర్విద్య, సైనిక సంబంధ విద్యలు, రంగు వేయుట, రాతి చెక్కడము, విగ్రహములు చేయుట, చేతిపనులు, జ్యోతిషము, పశువైద్యము మున్నగునవి కాన్పించుచున్నవి.

---

[1] ఈశాద్యష్టోత్తర శతోపనిషదః - నిర్ణయసాగర ప్రెస్ బొంబే. పుట63

భారతీయ వైద్య పద్ధతిని స్ట్రాబో అను గ్రీకు లేఖకుడు ప్రశం
సించెను. ఇచట శస్త్రవైద్యము కూడ చెప్పియున్నట్లు
కాన్పించుచున్నది. భారతీయులు సర్పకాటుకు మూలికా
వైద్యము చేయుచురని గ్రీకులేఖకులు వ్రాసిరి. అలెగ్జాండరు
కూడ ఈ వైద్యమునుజూచి ఆశ్చర్య చకితుడాయెను. పాణిని,
జీవకుడు, చాణక్యుడు ప్రసేనజిత్తు, మున్నగువారు ఈ విద్యా
లయములో జదివిరని కొందరు విద్వాంసులు వ్రాసిరి. జీవకుడు
మాత్రము తక్షశిలా విద్యాలయ విద్యార్థియని వినయ పిట
కము మహావగ్గము తెల్పుచున్నది. తక్షశిలలో 'భిక్షు
ఆత్రేయఋషి' వైద్యాచార్యుడుగా నుండెను. బుద్ధునికి జికిత్స
చేసిన జీవకు డిచట ఏడేండ్లు విద్య నేర్చెను.[2] వచ్చునపుడు
గురువు, నగరముచుట్టు 15 మైళ్ళ అర్ధవ్యాసములోనున్న
వన మూలికల వైద్య గుణములగూర్చి ప్రశ్నించగా, జీవకుడు
నాల్గు దినములు పరీక్షించి, వైద్యమునకు పనికిరాని మూలిక
కాన్పించ బోదనిచెప్పి, అన్ని మూలికల గుణముల చెప్పెను.
ముఖ్యముగా వైద్యము చదువుటకు రాకుమారులు, వర్త
కులు, బ్రాహ్మణులు ఏగుచుండిరని, జాతక కథలు, తెల్పు
చున్నవి; స్మిత్ అను చరిత్రకారుడుకూడ ఇదివ్రాసెను. చిత్తసం
భూత జాతకమును బట్టి (J IV—P 391–2) హరిజనుల
కీ విద్యాలయములో ప్రవేశములేట్లు కాన్పించుచున్నది.
మధ్య తరగతి ప్రజలకు, క్రింది తరగతుల వారికి ఈ విద్యా
లయము వలన పెద్ద ప్రయోజనమున్నట్లు కాన్పించదు. వర్ణా
శ్రమ ధర్మములకు ప్రాధాన్యత ఉండుటచే, సరిసమానావ
కాశములు కాన్పించవు. బౌద్ధుల విద్యావిధానము చాలవరకు

---

[2] అస్మదీయ విరచితవ్యాసావళి — జీవక చరిత్ర 29—34.

తాకిక సంబంధమై యుండెను. క్రీ. శ. 7 వ శతాబ్దములోని 'నాలందా' విద్యాలయము ప్రఖ్యాతి గాంచెను. చైనీయ పరి వ్రాజకులు, 'హూనుత్సాంగు, ఇత్సింగు'లు ఈ విద్యా లయములోనే అనేక సంవత్సరముల కాలము చదువుకొనిరి. ఇంకను, జావా, సుమెత్రా, కొరియా, చైనా, జపాను, సింహ ళములనుండి విద్యార్థులువచ్చి యిచట చదువుకొను చుండిరి. వీరిచటి నక్షత్ర గణితశాలను, నీటి గడియారమును వర్ణించిరి. ఇచట బౌద్ధ పిటకములేకాకుండా 18 శాఖల బౌద్ధ శాస్త్ర ములు, శిల్పవిద్య, సాంఖ్యము, వేదములు, బ్రాహ్మణములు, వ్యాకరణము, తర్కము, వైద్యము (శబ్ద, హేతు, చికిత్సా విద్యలు) సంస్కృతము, పాళి, ఇంక ఇతర విషయములు చెప్పు చుండిరి.[3] ఇచటి ద్వారపాలకులు గొప్ప విద్యా వంతులై యుండిరి. విద్యార్థులు దీనిలో ప్రవేశించుముందు, ద్వారపాలకుల ప్రశ్నలకు సమాధానము లిచ్చినగాని లోన ప్రవేశించుట కర్హతలేదు. ఇందు 6 కళాశాలలు, గొప్ప గ్రంథాలయము గలదు. 10000 మంది విద్యార్థులు, 1500 మంది అధ్యాపకులు గలరు.

బౌద్ధుల విహారములు, సంఘారామములు గొప్ప విద్యా లయములుగా గాన్పించుచున్నవి. ఈ విహారములు గురుకుల ములవలెనుండెను. పురుషపురము (పెషావరు) జయేంద్ర విహారము (కాశ్మీరములోనిది) విక్రమశిల, జగద్దాల, ఉదంత పురి. ధాన్యకటకము (అమరావతి) నాగార్జునకొండ, తామ్ర లిప్తి, కాంచీపురము, కనూజి, కాశీ, వాలాభి, మున్నగు

[3] Samuel Beal - Life of Hiuen Tsiang P. 112

విద్యాలయములు ప్రసిద్ధిగాంచెను. అమరావతి విశ్వవిద్యాలయపద్ధతిలో 'లాసా'దగ్గరఉన్న 'దూపాంగు' విహారము, ఒక విశ్వవిద్యాలయము, 6 కళాశాలలతో నేర్పరచబడెను. ఇత్సింగు, అను చైనీయ లేఖకుని వ్రాతలనుబట్టి ఆ కాలపు విద్యావిధానము తెలియుచున్నది.

మొదట 'సిద్ధిరస్తుతో' ఆరంభము. 49 అక్షరములు కలిపి, 18 భాగములుగా విభజింప బడెను. ఈ అక్షర సముదాయములు పదివేలుఅగుచుండెను; లేదా300 శ్లోకము లాయెను. ఒక శ్లోకము 4 పాదములు, పాదమునకు 8 అక్షర సముదాయములు; బిడ్డలు 6 వ ఏట ఆరంభించి, 6 నెలలలో దీనిని ముగించెదరు. తర్వాత 1000 శ్లోకములుగల పాణిని సూత్రములు, 8 ఏండ్ల వయసున నారంభించి, 8 మాసము లలో వల్లించుచుండిరి. తరువాత వ్యాకరణ ధాతువులు గల్గిన 1000 శ్లోకముల ధాతుమంజరిని వల్లించుచుండిరి. పిమ్మట ఖిలత్రయమును అనగా 1000 శ్లోకముల అష్టధాతువుల, 1000 శ్లోకముల 'వెంచ'ను, 1000 శ్లోకముల 'ఉనాది'ని 10 వ ఏట ఆరంభించి, 13 వ ఏడు పూర్తియగు నప్పటికి ముగించుచుండిరి. తరువాత 18000 శ్లోకములుగల వృత్తిసూత్రములుగల 'కాశికావృత్తి' యను గ్రంథమును 15 వ ఏటఆరంభించి 5 ఏండ్ల తర్వాత ముగించుచుండిరి. బాలురు వీనిని కంఠస్థము చేయవలెను. పై గ్రంథకర్త 'గాయాదిత్యుడు' ఏకసంధాగ్రాహి.

వీని తర్వాత గద్య, పద్య రచనలు నేర్చి, హేతువిద్య, అభిధర్మకోశముల జదువుచుండిరి. అనుమానమునకు 'న్యాయ

ద్వార తర్క-శాస్త్రము' జదువుచుండిరి. ఆ కాలములో 'జాతక మాల' అను గ్రంథమును హెచ్చుగా జదువుచుండిరి. దీనివలన విస్తారమైన జ్ఞానము గల్గుచుండెను. దీనితో రెండు, మూడుఏండ్లు గడచుచుండెను. దీనితర్వాత వృత్తిసూత్రములపై వ్యాఖ్య యగు 'కుర్ని' అను 24000 శ్లోకములుగల గ్రంథమును 3 ఏండ్లలో ముగించుచుండిరి. కుర్నిపై వ్యాఖ్య, భర్తృహరి రచితమైన 25000 శ్లోకములుగల భర్తృహరి శాస్త్రము తరువాత నేర్పుచుండిరి. వృత్తిసూత్రములు, కుర్ని, భర్తృహరి శాస్త్రమును గలిపి 'రత్నత్రయము' అనుచుండిరి. పిమ్మట 'వాక్యపాదీయ' అను 700 శ్లోకములుగల భాగమును దీనిపైన 7000 శ్లోకములుగల వ్యాఖ్యను బఠించుచుండిరి. తరువాత 3000 శ్లోకములుగల 'పైన', **(Peina)** దీనిపైన 14000 శ్లోకములుగల వ్యాఖ్యను నేర్పుచుండిరి. ఇందు శ్లోకభాగము భర్తృహరిచేత, వ్యాఖ్యభాగము ధర్మపాలునిచేత వ్రాయబడెను. ఇవి జంబూద్వీపములో ప్రఖ్యాతిగాంచి యుండెను. ఇది ఆ కాలపు విద్యావిధానము.[4] దీనివలన వైరాగ్యము, పారలౌకిక చింత, భక్తిభావము, దార్శనిక చింత అధికమగును. ప్రవృత్తిలోనుండి నివృత్తిని గూర్చి సంతత మాలోచించు చుండును. ఈ విద్యావిధానమువలన భౌతిక ప్రపంచములో గొప్ప పండితుడగును. రసానుభూతిగల సాహిత్యములో మునిగి తేలును. బంధవిముక్తికి సాధనభూతుడగును; కాని లోకసేవకు నిరుపయోగము. ఈలాగుననే 'హానుత్సాంగు' కూడ వ్రాసి

---

[4] J. Takakusu—A record of the Buddhist religion as practised in India and the Malaya Archipelago.

By 'Itsing' — p. 170

నాడు. 'బిడ్డలు 7 ఏండ్ల వయసు వచ్చినపుడు, పంచశాస్త్రములకు సంబంధించిన గ్రంథముల జెప్పుచుండిరి. వ్యాకరణ శాస్త్రమే ఐదుశాస్త్రములకు లేక శబ్దవిద్యకు మూలము. అవి యిట్లుండెను. "1. శబ్దవిద్య, 2. శిల్పస్థానవిద్య, 3. చికిత్సావిద్య, 4. న్యాయవిద్య, 5. ఆధ్యాత్మవిద్య. చివర దానిలో 5 మార్గములు, కర్మసిద్ధాంతము బోధించబడు చుండెను. ఆయుర్వేదమునకు ప్రాధాన్యత యుండెను. బ్రాహ్మణులు ఆయుర్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము పఠించుచుండిరని, పై లేఖకుడు వ్రాసెను. ఈవిద్య మతప్రచారమునకు, మతప్రబోధమునకు సాయకారిగా నుండెను.[5] పరమునకు సంబంధించిన జ్ఞాన మధికముగా నుండెను. ఇత్సింగు వ్రాతలప్రకారము వారు సాధ్య, అసాధ్య సిద్ధాంతములగూర్చి తర్కించు చుండిరని తెలియును. ("They assemble in crowds and discuss possible and impossible doctrines") రోజుచాలా అల్పమైనదిగా నుండెనని (The day is too short for them) తెలియు చున్నది. అనేక శాస్త్రరచయిత అయిన 'క్షత్రియ జయ సేనుడు' 'భద్రరుచి' యొద్ద 'హేతువిద్య, స్థితమతిబోధి సత్వని క్రింద శబ్దవిద్యాశాస్త్రము, శీలభద్రుని క్రింద యోగశాస్త్రము చదివెను. నాల్గువేదములు, జ్యోతిషశాస్త్రము, చికిత్సా శాస్త్రము, తంత్రశాస్త్రము, గణితశాస్త్రము మున్నగు వానిలో పారంగతుడాయెను. మగధరాజు 'పూర్ణవర్మ' యను వాడతనికి 20 పట్టణముల యాదాయ మిచ్చెదనని

---

[5] T. Watters — On Yuan chwang's travels in India — vol. I p. 154.

వాగ్దానమొనర్చెను. కాని పూర్ణవర్మ నిరాకరించెను; 'శిలాదిత్యుడు', ఒరిస్సాలోని 80 పెద్దపట్టణముల నిచ్చెదనని వాగ్దాన మొనర్చెను. అవికూడ నిరాకరించి యిట్లు చెప్పెను. "ఎవ్వరీప్రపంచ వేతనముల గైకొనునో వాడు ప్రపంచ బంధములలో దగుల్కొని పోవునని 'జయసేనుడు' విని యున్నాడు; నాయభిప్రాయము జననమరణబంధముల స్వభావమును గూర్చి బోధించడమే. రాజసంబంధమగు ద్రవ్యాదులతో బరిచయము గల్గించుటకు నాకు వ్యవధి ఎచట నున్నది? అంతటాయన 'యష్టివనము'లో నివసించెను.[6] ఈలాగుననే క్రీ. శ. 9వ శతాబ్దములో 'వీరదేవుడనువాడు' వేదములన్ని చదివి పెషావరులోని కనిష్క మహావిహారమున కేగెనని 'గౌరలేఖ మాల శాసనములు' తెల్పుచున్నవి.[7] "గజంమిథ్య, పలాయనంమిథ్య" అను భావములు హెచ్చుగానున్నవి. కొందరు అద్వైతభావము కల్గి దారేషణ, పుత్రేషణ, ధనేషణలు వీడి బ్రహ్మచర్యము, యోగములతో జీవన్ముక్తి పొందుచుండిరి.

బౌద్ధమతము క్షీణించిన తర్వాత మరల హిందూమత విజృంభణముసాగినది; ముస్లిము దండయాత్రలు వచ్చులోపుగా కొన్ని దేవాలయములు విద్యాలయములుగా, కళాశాలలుగా మారెను. బీజపూరులోని 'సాలోత్గి,' ఆర్కాటులోని 'ఎన్నాయిరమ్', చెంగల్పట్టులోని 'తిరుముక్కూదల్' లలో కళాశాలలు, కాన్పించుచున్నవి. అపుడే కాశి, నవద్వీపము,

[6] Samuel Beal — Life of Hiuen Tsiang — p. 153.

[7] N. N. Majumdar M. A. — A history of education, in Ancient India — p. 16 - See Gouralekha Mala'

లేక నాడియా (Nadia) మిథిలలలో విద్యాలయములు వెలసినవి. వీనిలో జెప్పబడు బోధ, న్యాయ, స్మృతి, కావ్య, అలంకారములకు సంబంధించి యుండెను.

తరువాత ముస్లిముల దండయాత్రలు సాగినవి. వీరు కూడ పాఠశాలలు, కళాశాలలు స్థాపించిరి. పాఠశాలలలో మహమ్మదీయ మతగ్రంథము 'కురాను, మత సిద్ధాంతములు, చెప్పబడు చుండెను. కళాశాలలలో శాస్త్రము, తత్వశాస్త్రము, న్యాయశాస్త్రము, చికిత్సాశాస్త్రము బోధించు చుండిరి. చిన్న పాఠశాలలలో మూడు మూలముల, చదువుట, వ్రాయుట, గణితము (3 rs) బోధించుచుండిరి. 'మద్రాసాలు' అనబడు విద్యాలయములలో వ్యాకరణము, తర్కము, సారస్వతము, శాస్త్రము, న్యాయశాస్త్రము, అలంకార శాస్త్రము, వేదాంతశాస్త్రము తత్త్వబోధ, మున్నగునవి చెప్పుచుండిరి. ఆకాలములో ఢిల్లీ, అగ్రా, లక్నో, రాంపురము, అజ్మీరు, పాట్నా, బీడారు' మున్నగునవి ప్రఖ్యాతి గాంచిన ముస్లిము విద్యాకేంద్రములు. అక్బరు చక్రవర్తి, ఆత్మను వధించు (Soul killing) వ్యాకరణ శాస్త్రమును తగ్గించి, శాస్త్రవిషయముల జేర్చెను. ఔరంగజేబు, చరిత్ర, భూగోళము, ఇతరజాతుల సారస్వతమును జేర్పించెను. ముస్లిములు చరిత్ర కత్యంతప్రాధాన్యత యొసంగుట విశేషము. 19 వ శతాబ్దములో 'విలియమ్‌వార్డు' భారతీయ పాఠశాలలను దర్శించెను. వంగదేశములోని 'నవద్వీపము'లో, 31 పాఠశాలలనుజూచెను. అందు 17 పాఠశాలలలో తర్కశాస్త్రము, 11 లో న్యాయశాస్త్రము, మూటిలోకవిత్వము, జ్యోతిషశాస్త్రము, వ్యాకరణ శాస్త్రము, బోధింపబడు

చుండెను. [8]బెంగాలులోని హిందూకశాలలలో కొన్నిటిలో వ్యాకరణము, న్యాయశాస్త్రము, పురాణములు, మరికొన్నిటిలో న్యాయ, దర్శన, తర్కశాస్త్రములుబోధించు చుండిరి. పాఠములన్ని వల్లెవేయుచుండిరి. మామూలు పాఠశాలలలో రామాయణ, మహాభారతములు బోధింపబడు చుండెను. ఇవియేనిజమైన చరిత్రలని, విద్యార్థులు, నమ్ముచుండిరి. దీనివలన మత, తత్వశాస్త్ర భావములేకాని నూత్న భావముల కవకాశమే లేదు. శాస్త్రీయదృష్టిలో మనోవికాసము కాన్పించదు. విక్రమశిలలోని కేంద్రభవనమునకు శాస్త్రభవనము (House of Science) అని పేరు. వీరు చదువు శాస్త్రములు 'ప్రజ్ఞాపరిమిత సూత్రములు; ప్రాచీన కాలపు విద్యావిధానమువలన, మతముతప్ప, ఇతరవిషయమేది వారి మనసులలోనికి చొచ్చుకొని యుండలేదు. ఒక విద్వాంసుడీ యభిప్రాయమునే వెలిబుచ్చెను. ("The energies of the people were directed into a different channel and religion, more than anything else became their all absorbing interest") ఇంకను 'సూరంగమ సూత్రము'లో బాహ్యమునకు గోచరించునదంత గగనకుసుమములవలె, అసత్యము, అదృశ్యమునగునది అని ఉన్నది.

గ్రంథములు చాలభాగము సంస్కృత భాషలోనే యుండెను. ఆధ్యాత్మికశాస్త్ర, మత సంబంధమగు గ్రంథములన్ని గీర్వాణభాషలోనుండుటచే, బహుకొద్ది మందిమాత్రమే చదువు కోగల్గు చుండిరి. చదువుకొన్నవారు, మతసంబంధ

[8] Dr D. Jiva Nayakam—The theory and practice of education — P. 40

మగు వారి సాహిత్యము విశ్వమానవ కల్యాణమున కుపక రించుననని తలంచుచుండిరి.

వేదకాలమున వైదికభాష, అనంతర కాలమున సంస్కృతము తరువాత పాళి, ముస్లిముల కాలమున ముఖ్యముగా అక్బరు కాలమునుండి పారసీకభాష, రాజభాషలై వెలసెను. ఆంధ్ర రాజుల కాలమున రాజభాష 'ప్రాకృతమై' యుండెను. ఆంధ్ర రాజులలో 14వ వాడు 'హాలుడు' 'శాలివాహన గాధాసప్తశతి' అను గ్రంధమును గుణాఢ్యుడు బృహత్కథను ప్రాకృతములో రచించెను. అంతకు పూర్వము నాగులు తెలుగుభాషను మాటాడుచుండిరి. నాగుల తెలుగు భాష, మహారాష్ట్రుల ప్రాకృతభాష, ఆర్యుల సంస్కృత భాషలన్ని కలిసి నేటి ఆంధ్ర భాషగా మారినది. లౌకిక సంస్కృతకాలము క్రీస్తు శకారంభమునుండి క్రీ. శ. 1000 వరకు వ్యాపించినది. లౌకిక భాషను సంస్కరించుట చేతనే సంస్కృతమైనది. ఇది ప్రాకృతమునకు ప్రతిద్వంది గ నేర్పడిన పదమని 'మెక్డనాలు' వ్రాసెను. క్రీ. శ. 7 వ శతాబ్దములో బౌద్ధులవాదనలు సంస్కృతమున జరిగెనని, 'హానుత్సాంగు' వ్రాసెను. 'పాతంజలి' సంస్కృతము మాటాడువారు శిష్టులని వ్రాసెను.

★

## 2

# భారతీయ సమాజస్థితి

హిందూ, బౌద్ధ, ముస్లిము కళాశాలలవలన భారత దేశమునకు భౌతికముగా ఉపయోగము కల్గలేదు. మతవిద్య, ఆధ్యాత్మిక విచారము, కర్మసిద్ధాంతము, మాయావాదము, వైరాగ్యభావము, హేతుబద్ధముకాని నడక, భౌతికవాద నిరసన, భగవంతు డవతారమెత్తునను నమ్మిక, తీర్థయాత్రల వలన ముక్తిగల్గునను విశ్వాసము, క్షణభంగుర జీవితముపై నిరాశ, వర్ణాశ్రమ ధర్మములు, వేదాదులు పరమపురుష నిర్మితమగుటచేత వాని కెదురాడకూడదను సిద్ధాంతము, ఇతిహాస పురాణములే నిజమైన చరిత్రలను నమ్మకము, జీవిత మశాశ్వతము కాన, అత్యుత్తమ మనుష్యజన్మలో బంధములో దగుల్కొనియున్న జీవాత్మను విడగొట్టి స్వస్వరూపానుసంధానమును జెందించుట, జననమరణ రాహిత్యమును జెందుట, విగ్రహారాధన, బాల్యవివాహములు, వెర్రిభక్తి, మూర్ఖనమ్మకములు, స్త్రీలలో పర్దా, ఘోషాపద్ధతి, విమర్శన జ్ఞానము లేకుండుట, మతభావమేకాని జాతీయభావము లేకుండుట యివియన్ని భారతీయ విద్యాఫలితములు. బహుపత్నీత్వముకలదు. రంజిత్ సింగుకు 9 మంది, దేవరాయలకు 500 మంది భార్యలు గలరు; యెందరో రాజులు యిష్టమువచ్చినంతమంది భార్యలను జేసుకొనుచుండిరి. భారతీయ ప్రతిభతో బాటు ఈ దురాచారములను గూడ కొంచెము ఆలోచించవలయును. దీనినే 'మెకాలే' కుళ్ళిపోయిన సమాజమనెను.

గురుభక్తి, నైతికవర్తనము, వినయవిధేయతలు, వైరాగ్యభావము, సత్యాహింసలు, క్రమశిక్ష, ప్రకృతితో సంబంధము, ఏకాంతవాసము, బ్రహ్మచర్యము, ధనమునందు ఆశలేమి, గురుశుశ్రూష, 36 ఏండ్లు గురుకులవాసము, గురువే దైవమను తలంపు ఇత్యాది సుగుణము లనేకములు కాన్పించు చున్నవి. యోగమువలన ఓజశ్శక్తి, దానివలన ధారణాశక్తి అధికమగుచుండెను. ఏకసంధాగ్రాహులు, ద్విసంధాగ్రాహులు హెచ్చుగాగలరు. వేదాదులన్ని వ్రాతలోలేకపోయిన, గురుముఖతా నేర్చి వాక్పేటికలలో నుంచుకొని తరతరములు వల్లించుచుండిరి. ఇవియన్ని వ్రాసిన పాతకమని భావించు చుండిరి.

సతి :— ఋగ్వేదములోగాని అనంతర వాఙ్మయములోగాని ఇది కాన్పించదు. ఇది సిథియనుల ఆచారమని గ్రీకులేఖకులే వ్రాసిరి. 'అనిసిక్రిటసు, స్ట్రాబో' మున్నగు వారు దీనిని పేర్కొనిరి. మహాభారతమును బట్టి కూడ పాండురాజు భార్య మాద్రి, కృష్ణుని నల్గురు భార్యలు సతి యైనట్లు తెలియవచ్చుచున్నది. 'డయోడోరసు' అను గ్రీకు లేఖకుడు కూడ వితంతువులు సహగమనము చేయుచుండిరని, బిడ్డలున్నవారిని సతిలేకుండ వదలివేయుచుండిరని వ్రాసెను. బాణుడు కూడ దీని నుల్లేఖించెను. హర్షుని తల్లి యశోవతి స్వయముగా అగ్నిలోదూకి చచ్చెను. హర్షునిసోదరి 'రాజ్యశ్రీ' చావబోగా హర్షుడువచ్చి రక్షించెను. 'రాణుక' అను రాజపుత్రుడు చనిపోగా అతనిభార్య 'సంపల్లదేవి' సతి ఆయెను. క్రీ. శ. 6 వ శతాబ్దములోని శిలాలేఖనములో భాగుగుప్తుని సేనాపతి గోపరాజుయొక్క స్త్రీ, సతియైనట్లున్నది. ఒక శిలా

లేఖనములో 'కలచురీ రాజా గాంగేయదేవుడు' చనిపోయిన పిమ్మట, అతని అనేక మంది భార్యలు సహగమనము చేసిరని యున్నది, క్రీ. శ. 902 లో కాశ్మీరరాజు 'శంకరవర్మ' చని పోయినపుడు ఆతనితో బాటు ముగ్గురు రాణులు, ఇరువురు దాసీలు, ఒక సేవకుడు 'జయసింహ' అనువాడు, సహగమ నము చేసిరి. క్రీ. శ. 1081 లో 'అనంతరాజు' చనిపోయి నపుడుకూడ అతని రాణి, ఇద్దరు మగ సేవకులు, కొందరు ఆడ వాండ్రు సహగమనము చేసిరి. ఈ ప్రకారము మగవారు కూడ సహగమనము చేయుచుండిరి. 'రంజిత్ సింగు' చని పోయినపుడు అతని 9 మంది భార్యలు సతిచేసిరి. క్రీ. శ. 1130 లో కదంబరాజు శైలపదేవుడు చనిపోయినపుడు, అతని అను చరుడు 'బోపన్న' కూడ సహగమనము చేసెను. 'మల్హార్ రావు హోల్కారు, భార్య రాణి అహల్యాభాయి, భర్త చని పోయినపుడు తానుకూడ సతి చేయనెంచెను; కాని పసిబిడ్డ ఉండుటచేత ప్రజలు వద్దనిరి. ఆమె కుమార్తె చనిపోయినపుడు కోడలు సతిచేసెను.ఇదిచూచిమూడుదినము లామెదుఃఖములో మునిగి, ఒక మాట కూడ మాటాడకుండెను. (G. Thompson—"She then retired to her place, where for three days having taken hardly any sustenance, she remained so absorbed in grief that she never uttered a word") రాజపుత్ర స్త్రీలలో 'జోహారు' లుండెను. 'ముహమ్మద్ ఇబ్న కాసిమ్' సింధుపై దండయాత్ర చేసినపుడు, ఆ రాజ్యమును హిందూరాజు లేలుచుండిరి. ఆఖరు రాజు 'దాహిరు'; ఆయన కుమార్తె జయసింహుడు. తన ప్రజలగు 'జాట్లు' ముస్లిములతో గలసి 'దాహిరు' నోడించిరి. అతని

రాణి కొంతమందితో యుద్ధము చేసెను; కాని ప్రయోజనము లేకుండెను. చివరకురాణి, మిగిలియున్న స్త్రీలతో 'జోహారు' చేసెను. భారతభూమిలో నిదియే మొదటి జోహారు. తర్వాత రాజపుత్ర స్త్రీలనేకులు జోహారు చేసిరి. శత్రువుల చేతులలో బడకుండ వారు కోటలోనే అగ్నిగుండము వెలిగించి, అందు దూకి ప్రాణముల బోగొట్టు కొనుచుండిరి. రాణి సంయుక్త మున్నగు వారందరు ఇట్లనే యసువుల బాసిరి.

సతి ఆచారము బెంగాలులో విశేషముగా నుండెను. క్రీ. శ. 1803 లో 438 సతులు క్రీ. శ. 1815 లో 378 మంది సతులైరి. 1817 లో 700 సతులు 1818 లో 839 సతులు కాన్పించుచున్నవి. భారత వర్షము మొత్తముమీద అనేకమంది స్త్రీ హత్యలు శాస్త్రము పేరుతో జరుగు చుండెను. డయోడోరస్, స్ట్రాబో, ఆబూజైడ్, న్యూనిజ్ మున్నగు విదేశీయ లేఖకులీ సతిని వర్ణించిరి. 'పరలోక ములో దనభర్తను గలసి కొందునను నమ్మకముతో స్త్రీలట్లు సహగమనము చేయుచుండిరని, ఈ నమ్మకమునకు హద్దు లేదని, విదేశీయ లేఖకులు వ్రాసిరి. అక్బరు, అహల్యాభాయి మున్నగువారు దీని నాపుటకనేక ప్రయత్నములు చేసి విఫల మనోరథులైరి. ఆంగ్లేయులు కూడ ఇది మతాచారమని చాల కాల మూరకుండి, రాజా రామమోహనుని సాయముతో దీని నాపివైచిరి. 'ఇంతకాలమీ అతి పాపిష్టమైన క్రూర దురాచారమును సహించి ఊరకుండుట బ్రిటిషుజాతికి శాశ్వత మైన అవమానమని, కళంకమని ("Lasting disgrace to the British nation that such diabolical cruelty should have been so long tolerated"—Ch. Eden-)

'ఈడెన్' వ్రాసెను. రామమోహనుని కృషి లేనిచో ఇది సాగిపోయి యుండెడిదే.

గంగానది దగ్గర సాగర దీవిలో నరబలులు దేవతల కిచ్చుచుండిరి. 'హానుత్సాంగు' అను చైనీయ యాత్రికుని కూడ నరబలి యిచ్చుటకు తీసికొని పోయిరి. కాని గొప్ప తుపాను వచ్చుటచేత, దొంగలు పారిడి పోవుటచేత ఆయన ప్రాణము దక్కెను. కాళీ, దుర్గ, మున్నగు దేవతల పూజ లధికము. నాలందాలో 1 మరీచి 2 అపరాజిత 3 వజ్ర శారద 4 మైత్రేయ 5 పదునెన్మిది చేతులతార మున్నగు దేవతల కంచు, రాతి విగ్రహములు సుందరముగా నుండెను. తార గొప్ప శక్తులు గలదని ఎవ్వరువచ్చి ఎదుర్కొన్నను, వానిని వధించునని ప్రజలు నమ్ముచుండిరి. కాని క్రీ. శ. 1202 లో భక్తియారు 'ఖిల్జీ' యనుయాయులగు ముస్లిముల కత్తి దెబ్బలు తగులుటచేత, ఆ విగ్రహము ముక్కలు, ముక్కలాయెను. తార యొక్క శక్తులన్ని అదృశ్యము లాయెను. విగ్రహారాధనను నిరసించు ముస్లిముల చేతులలో బలు విగ్రహము లిట్లనే పోయెను. ఇంకను వెట్టినమ్మకము లనేకములు కాన్పించుచుండెను. భక్తులు చర్మములపై వాతలు వేసికొని, తిరుచినాపల్లినుండి 'ఫిల్ని' వరకు 100 మైళ్ల బార్లున రోడ్ల పైన దొర్లుచుండిరి. పాండాలు ఇనుప చీలలతో బిగించిన తడికెల దాల్చుచు తిరుగుచుండిరి. కొందరు తాళ్లతో శరీరము కందునట్లు బాదుచుండిరి; విగ్రహారాధన అధికముగానుండెను. బ్రతుకు తెరవు కొరకు ఒక విగ్రహమును ప్రతిష్ఠించి, దాని ద్వారా అమాయక ప్రజలను దోపిడిచేసి జీవించుచుండిరి. సన్యాసులు, ఫకీర్లు అనేక విధములగు వేషములు వేసికొని,

జనుల మోసగించుచుండిరి. 17 వ శతాబ్దములోని భక్తుడైన 'మూలుక్ దాసు' విగ్రహపూజ నపహాస్యము చేసిన, విను వారు లేరు. ("If God could be reached by worshipping a stone, I should worship the mountain.") సూర్య చంద్ర గ్రహణములు రాహు కేతువులను పాములు మ్రింగుటచేత కల్గుచుండెనని అమాయక ప్రజలు నమ్ము చుండిరి. గ్రహణానంతరము స్నానములు చేయుచుండిరి. ఈ పద్ధతియందు నమ్మకము గల్గుటచేత జ్యోతిషశాస్త్రము, వైద్యశాస్త్రము, చరిత్ర, భూగోళములలో నభివృద్ధిగల్గకుండ నిరోధమై యుండెను. (B. C. Law volume—A. S. Altekar—"They went on professing adherence to the legend of the demon Rahu devouring the moon. This attitude stood in the way of further progress in science like astronomy and medicine, history and geography") బహుపత్నీత్వము రాజులలో, మహా రాజులలో, జాగీర్దారులలో కాన్పించును. ఒకేభార్యతో తృప్తిపడ్డ రాజు కాన్పించడు. జయపూరు రాజాకు 3000 మంది భార్యలుండిరని 'గురుముఖసింగు' వ్రాసెను. బాల్య వివాహములు హెచ్చు. వర్ణాంతర వివాహ ములు, అంతర్వర్ణ భోజనములు అరుదు, కుల పోరు లధికము. మతతగాదా లధికము. దేవుడెద్దు నెక్కిన వాడా, గద్ద నెక్కినవాడా! అను విషయమై తగాదాలాడు చుండిరి. మత సహనము లేకుండెను. ప్రతి విషయమునకు కర్మ సిద్ధాంతము నాపాదించుచుండిరి. యజ్ఞ యాగాది కర్మల వలన కోరినవి సమకూడునని తలంచుచుండిరి. గంగానదిలో మధ్యకుపోయి దూకి చనిపోయిన పుణ్యమని తలంచి ప్రతి

వర్షము దాదాపు 50 వేలమంది దూకి చనిపోవుచుండిరి. భాగీరథీ జలంబులబడిన కైలాసయాత్ర గల్గునని వారి నమ్మకము; పూరీ జగన్నాథ రథము క్రిందబడి మరణించిన పుణ్యమని తలంచి, అనేకమంది ఆత్మహత్య ఆ విధముగా జేసికొనుచుండిరని టావర్నియర్, బెర్నియరులు వ్రాసిరి. సముద్రాంతర ప్రయాణములు చేసిన, అపవిత్రమగునని తలంచి తిరిగి వచ్చిన తర్వాత ప్రాయశ్చిత్తములు జరుపుకొను చుండిరి. నరమాంస భక్షకులు కూడ ఉండిరి. జాతరలు, బలులు అధికముగానుండెను. అఘోరీలు అనువారు మనుజుల పుర్రెలలో భుజించి, శ్మశానాదులలో నివసించుచు, రాత్రిపూట సంచారము చేయుచుండిరి. ఈ అఘోరి దేవతకే నరబలులిచ్చుచుండిరి. 'వారన్ హేస్టింగ్సు' దీని నాపివైచెను. ప్రాచీన గ్రంథములలో నేవిషయమున్నను నమ్ముచుండిరి; శాస్త్రజ్ఞానము లేక ప్రజలమాయకులై యుండిరి. బానిసత్వముండెను. కులభేదములు హెచ్చు. ఒక కులమువారింకొక కులమువారిని తాకరాదను భావముండెను. **(Touch me not Conservatism)** అల్బరూని ఇట్లు వ్రాసెను. "వారి దేశముతప్ప ఇంకొకటిలేదని వారిజాతివంటి దింకొకటిలేదని, వారి రాజుల వంటిరాజులు లేరని, వారి మతమువంటి మతములేదని, వారి శాస్త్రమువంటి శాస్త్రములేదని హిందువులు నమ్ముచుండిరి." ఈ లేఖకుడు సాంఘికాచారములను జూచి యిట్లు వ్రాసెను. "హిందువుల మూర్ఖత్వమంత విదేశీయులపైన చూపబడు చుండెను. వారు విదేశీయులను మ్లేచ్ఛులని, అపరిశుద్ధులని పిల్చి, వారితో నేవిధమైన సంబంధములు అనగా వివాహములు, కూర్చుండుట, తినుట, త్రాగుట మున్నగునవేవి

జరిపిన, వారపరిశుద్ధులగుదురని భావించి వారిని నిషేధించు చుండిరి. ఇంకను విదేశీయుడు నీరుగాని నిప్పుగాని తాకినచో, దానిని తాకుట అపవిత్రమని భావించుచుండిరి.'' ఇంకను వారికి తెలిసినవిషయము లితరులకు చెప్పుటలోగాని, ఇతరులనుంచి స్వకులమైన, విదేశీయులైనసరే స్వీకరించుటలోగాని, పిశి నారి తనమును (Niggardly) జూపుచుండిరి. అనేక వైద్య శాస్త్రి, తంత్రశాస్త్రివిషయములిట్లే వారితోనే నశించి పోయినవి. ఇట్టి సంకుచితత్వము ప్రాచీన భారత భూమిలో గాన్పించును. వేదాదుల వల్లించుటకు క్రమపాఠము, జట పాఠము, ఘనపాఠములతో బఠించుచు, యౌవనమంత దాదాపు 36 ఏండ్ల కాలము వ్యర్థ పరచుచుండిరి. ''హిందువులలో జాతీయభావములేదు: విదేశీయులతో పోరాడు నాయకులు తమ చిన్నమండలముకొరకేకాని, సమిష్టిదేశ రక్షణకుకాదు.''[8A] అని ఒక విద్వాంసుడు వ్రాసినదిసత్యమే. భారతీయులలో చరిత్ర, భూగోళము వైద్యశాస్త్రాదులేవియు శాస్త్రీయ దృక్పథములో నేర్పరచలేదు. అభ్యుదయ భావములులేవు. స్త్రీవిద్య అధికముగా వ్యాప్తికాలేదు. అస్పృశ్యత అధికముగానుండెను. రజస్వలానంతర వివాహములు చేసిన వెలివేయుచుండిరి. పదమూడేండ్లకే పెండ్లి జరుపుచుండిరి.

★

[8A] A—Iswari Praad—A new History of India P. 165.

# 3

## ఆంగ్లేయ విద్యాప్రారంభము - వ్యాప్తి

ఆంగ్లేయులు రాజ్యపాలన యారంభించిన కొంత కాలము వరకు పరిస్థితు నిట్లనేయుండెను. సంస్కృతభాష మృతభాషయై యుండెను. 'లాటిన్ భాష' రోమను కాథలిక్కుల కెట్టిదో, సంస్కృతభాష బ్రాహ్మణమతమున కట్టిదే యని 'రాప్సను' వ్రాయుచున్నాడు. ఇది సత్యముగానే యున్నది. ఈ సమయమున భారత దేశమున కెట్టిభాష కావలె నను విషయము ఆలోచనలో బడినది. క్రీ. శ. 1823 లో 'ఆదము' అను ఆంగ్లేయుడు, ఈ దేశీయులకు ఉపయుక్తమగు జ్ఞానము, ఉత్తమవిద్య, పశ్చిమ దేశీయుల కళలు, శాస్త్రముల వలన కల్గునని ఎంచి, వారికి సూచనలు చేయుటకు పూను కొనెను. క్రీ. శ. 1799 లో 'విలియమ్ కారి' (Willam Carry) ఈ దేశీయులకు పాశ్చాత్యుల విద్యావిధాన ముపకరించుననెను. డేవిడ్ హేర్, రాజారామమోహనరాయలు, దేశములో సాంఘికమైన చెడుపనులు పోవుటకు, విచారణ, హేతుబద్ధమైన నడక సాగించుటకు, ఈవిద్య అవసరమని అభిప్రాయపడుచుండిరి. ప్రాచ్యవిద్యావిధానము, సంస్కృత భాష, ఆంగ్లేయవిద్య రుచిచూచిన భారతీయులకు రుచించ లేదు. భౌతికముగా సంస్కృతభాష నిరుపయోగమై యుండెను. అందరు ఆంగ్లేయ భాష కావలయునని కోరుచుండిరి. ("The demand was all for English education. Oriental learning did not pay in a wordly sense"—Cultural history of India—Yusuf

**Ali P 116)** కాని కొందరు ఆంగ్లేయులకే ఈ భాష బోధించుట ఇష్టములేదు. 1833 లో ఒక కంపెనీ డైరక్టరు యిట్లు నుడివెనని, 'జె. సి. మార్షమన్' (J. C. Marshman) ప్రభువుల సభలో నిట్లు చెప్పెను. "మన తెలివి తక్కువ తనముచేత అమెరికాలో కళాశాలలు, పాఠశాలలు పెట్టి మనమా దేశమును గోల్పోయినాము; హిందూదేశములోగూడ నట్టి తెలివి తక్కువపని చేయరాదు." స్వార్థప్రయోజనము హత్తుకొనిపోయిన ఆంగ్లేయులు కొందరు భారతీయులు ఇంగ్లీషువిద్య నేర్చి తెలివితేటలు కలవారై, శాశ్వత బ్రిటిషు పాలన కాటంకదాయకమగుదురని కూడ యోచించసాగిరి. ("The vested interests considered the growth of an Indian intelligentsia educated in English as dangerous to the permanence of British rule" Yusuf Ali—Cultural History of India – P 118) కాని 'మేహ్యూ' (Mayhew) అనువాడు ఆంగ్లేయ విద్యా విధానములో మూడు ఉద్దేశ్యములు గలవని సూచించెను. "రాజ్యపాలనా పద్ధతిలోసహాయపడుటకు, హిందూ ముసల్మానులకు తరిబీతు నొసంగుట, వెట్టి భక్తి, అమాయకత్వముచేత కల్గిన నైతిక, సాంఘిక సంబంధమగు దురాచారములను అణచుటలో భారతీయుల సహకారము పొందుట, దేశక్షేమమును, ఐహికసంబంధ సాధనముల నభివృద్ధిపరచుట, ఈ యుద్దేశ్యముతోనే ఆంగ్లవిద్యా స్థాపనకు బూనుకొనిరి.

'మెకాలే' (Lord Macaulay) కు భారతీయులు విద్యాగంధములేకుండ, మూర్ఖనమ్మకములలోబడి తిరుగుట యిష్టములేదు. అట్టి ప్రజానీకమునకు వెలుగు చూపించవలె

నని అతని ఆశయము. అందుచేత లౌకిక సంబంధ మగు శాస్త్రములు, కళలు, బోధించినచో, ఛాందసశాస్త్ర దాస్యమునుండి విముక్తినొందు భాగ్యము భారతీయులకు గల్గునని వారుతలంచిరి. 'మెకాలే' క్రీ.శ. 1830 లో 'ఇది, కుళ్లిపోయిన సంఘమును పునరుద్ధరించుటకు తీసికొను అత్యద్భుతమైనచర్య' అని పేర్కొనెను. (Macaulay-undertaking the stupendous process of reconstructing a decomposed society) ఇంకను వారిట్లు అభిప్రాయపడిరి. "గాడిదను తాకిన ప్రాయశ్చిత్త మేమిటి? మేకనుజంపిన ఏ వేద మంత్రమును జదివిన ఉప శాంతిగల్గును? ఇట్టిచదువులతో యౌవనమును వ్యర్థపరచుట, అందులో ముఖ్యముగా ప్రజా ద్రవ్యముతో నీపనిచేయుట నిష్ప్రయోజనమని వారభిప్రాయ పడిరి. ("And while we act thus can be reasonably and decently bribe men out of the revenues of the state to waste their youth in learning how they are to purify themselves after touching an ass, or what text of the Vedas they are to repeat to expiate the crime of killing a goat.") భాష బోధించడమే కాదు; నూత్నవిజ్ఞానము, నూత్నభావములు, జీవితములో మతములో, రాజకీయములో, ప్రభుత్వములో నూత్నసరళి, ఈ విషయములన్ని ధీశక్తి సంపన్నుడగు 'మెకాలే' మనసులో నుండెను. 1824—2—18వ తేదీన 'జేమ్సుమిల్లు' అను నొక డైరక్టరు యిట్లు చెప్పెను. "హైందవ విద్యలు చెప్పుట మా అంతిమలక్ష్యము కాదు; ప్రజల కుపయోగించు విద్య చెప్పుటయే మా ఉద్దేశ్యము. ప్రాచ్య గ్రంథములలోని శాస్త్రములు బోధించుట కాలహరణము; భారత దేశము

లోని బ్రిటిషుసమాజముయొక్క గాలి, మొత్తముమీద లౌకికమేకాని, మతసంబంధము కాదు. (James Mill — "Our great end should be not to teach Hindu learning but sound learning and added that it would be waste of time to teach sciences as found in oriental books. — It must be remembered that the atmosphere of British society in India was on the whole not been religious but secular.") సర్ చార్లెసు మెట్కాఫి యిట్లు చెప్పెను. "భారతీయుల నభివృద్ధిపరచుటకు ఇంగ్లీషుభాషద్వారా మాత్రమే సాధ్య పడును." ("The English language seems to me to be the channel through which we are most likely to convey improvement to the natives of India" – Sir Charles Metcalfe) జాన్ కంపెనీ డైరెక్టరు కూడ హిందూ, ముస్లిము సారస్వతములో ఉపయుక్తమైనది లేదు అని చెప్పెను. ("We suspect that there is little in Hindu and Mahommadan literature that is useful.") విల్కిన్సు, జోన్సు, ప్రిన్సెప్, విల్సన్ మున్నగువారు అరబ్బీ సంస్కృతములలో 100 మిలియను ప్రజల పవిత్ర గ్రంథములు వ్రాయబడుటచేత వానిని బోధించవలెను" అని చెప్పుచుండిరి. 'మెకాలే' ఈ సారస్వతమునుగూర్చి చెప్పుచు "పనికిరాని, కేవలము కాగితముపైన పెట్టబడిన ముద్ద" యని చెప్పెను; కాని దీనినంతయు అంగీకరించ జాలము.

ఇక భారతదేశములో నసాధారణ ప్రజ్ఞలుగల్గిన 'రాజా రామమోహనుని' వాక్యములు తిలకించెదము. ఈయన అరబిక, పర్షియన్, బెంగాలి, సంస్కృతము, ఇంగ్లీషు, ఫ్రెంచి,

లాటిన్, గ్రీకు, హీబ్రూ భాషలలో పండితుడు. గొప్ప విద్వాంసుడు, మేధావి, పత్రికా సంపాదకుడు. ఆంగ్లేయ భాషావ్యాప్తికీ మహనీయుడు దినదినము ఉవ్విళ్లూరు చుండెను. భారత దేశములో నొక సంస్కృత కళాశాలను బెట్టవలెనని ఆంగ్లేయులుద్దేశించి ప్రారంభించనున్న తరి, రామమోహన రాయలు, తన అసమ్మతిని దెలియపరచుచు క్రీ. శ. 1823 లో నీ విధముగా భారత ప్రభుత్వమున కొక లేఖ వ్రాసెను. "హిందూ పండితుల యాజమాన్యమున నొక సంస్కృత పాఠశాలను స్థాపించనున్నారని వినుచుంటిమి. వారు బోధించు జ్ఞానము ఈవరకములులో నున్నదే కదా! ఈ పాఠశాలలో జెప్పుబోధలు, వ్యాకరణ సూత్రములు వేదాంత సిద్ధాంతములు వారికిగాని, సమాజమునకుగాని ఉపయోగించకపోగా యువకుల మనస్సులు వానితో బరువెక్కి పోవునుగదా! అచటి విద్యార్థులు 2000 ఏండ్ల క్రితము తెలిసినవానినే నేర్చుకొందురు; ఇంకను అధికముగా తర్వాత వచ్చినధ్యానశీలురైన మనుజుల వ్యర్థమైన యుక్తులు, చమత్కారములు, మామూలుగా నన్నిచోట్ల వ్యాపించెడి అనిశ్చిత సిద్ధాంతములు, హిందూదేశములో నన్నిచోట్ల మామూలుగా బోధించెడివేకదా! ఈ సంస్కృతభాష నేర్చుటకు ఒక జీవితమంత సరిపోవునంతటి కష్టమైనది; తెరమరుగున దాగియున్న ఈ సారస్వతము, నేర్చుకొనుటకు పడుశ్రమకు చాలిచాలకుండును. ఈ భాషను శాశ్వతముగా నుంచవలసిన యవసరమున్నచో, దేశములోనున్న అందరుపండితులకు సహాయము చేయుటకు ధనమివ్వ వలసివున్నచో, క్రొత్త సంస్కృత కళాశాలను స్థాపించుటకంటె ఉచితముగా పారితోషికములు, ద్రవ్యము

ఆయాపండితులకు సమర్పించిన చాలమంచిది.——కనబడు వానికెల్ల యదార్థమైన ఉనికిలేదని, తండ్రి, తల్లి, సోదరుడు మున్నగువారికి వాస్తవమైన సత్యములేదని, అందుచే ప్రేమ యవసరములేదని, ఎంతశీఘ్రముగా వానిని, జగత్తును వదలిన అంతమంచిదని చెప్పెడి వేదాంతబోధలు నమ్మవలసినదిగా బోధించుటవలన, సమాజములో యువకులు ఉత్తమసభ్యులుగా నుండుట కర్హులుకారు. బ్రిటిషు చట్టనిర్మాతల యభిప్రాయ మిట్టిదైనచో, సంస్కృతి విద్యావిధానము దేశమును అంధ కారములో నుంచుటకు ఉత్తమమైనది —— మనభాష లింక విలువగలవి యగుటకు ఇంగ్లీషు చదివి అధికమగు జ్ఞానము నార్జించవలెను—స్వదేశీయులను సర్వతోముఖముగా నభివృద్ధి పరచుటయే ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యమై యున్నది.అందు చేత, దీని ఫలితముగా నైతికమైన సర్వవిషయజ్ఞాన సంబంధ మగు, వెలుగును గల్గించు ఉపదేశపద్ధతి అనగా గణిత శాస్త్రిము, సహజ తత్వశాస్త్రిము, రసాయనశాస్త్రిము, శారీరనిర్మాణశాస్త్రిము మిగత ఉపయుక్త శాస్త్రములతో నభివృద్ధిపరచవలెను. ఈ కార్యమును, ఖర్చుపెట్టుటకు తీర్మా నించబడిన సొమ్ముచేత, యూరోపులో విద్యార్జన చేసినట్టి ప్రతిభ పాండిత్యము గల్గిన కొందరు పెద్దమనుష్యుల నియామ కముచేత, అవసరమైన పుస్తకములు, ఉపకరణములు, ఇతర సాధనసామగ్రితో సరఫరాకాబడిన కళాశాలచేత, కొనసా గించ వచ్చును.''

''హిందూసంఘములోని సాంఘిక దురభ్యాసములను బోగొట్టుటకు, శాస్త్రబోధ సహాయపడును.'' (చూడుడు అను బంధము.)

క్రీ.శ. 1835వరకు ఐరోపీయ తత్వశాస్త్రము, పాశ్చాత్య శాస్త్రములు, సంస్కృతములోనికి. అరబిక్ భాషలోనికిమార్చి చెప్పవలెనని ప్రభుత్వము ఉత్తరువులు చేసెను. అప్పటికింకను ప్రభుత్వము ఇంగ్లీషు భాషను రాజభాషగా గుర్తించలేదు.

బ్రిటిషువారు వర్తకులుగానచ్చి, పిమ్మట ప్రభువులై తమపలుకుబడి నుపయోగించి, తమవిద్య నారంభించ సాగిరి. క్రీ.శ. 1800 లో 'వెల్లస్లీ' 'విలియమ్' కోటలో నొక కాలేజి స్థాపించెను కాని యిది సాగలేదు. భారత దేశములో ఆంగ్లేయ విద్యారంభమునకిదియే మొదటదశ. క్రీ.శ. 1810 నుండి ఈ దేశములో యింగ్లీషు, చిన్న పాఠశాలలలో ఆరంభించబడెను. క్రీ.శ. 1816 లో 'డేవిడ్ హేర్' అను క్రైస్తవమత బోధకుడు, రాజారామమోహనుని సాయముతో 'కలకత్తా' నగరములో నొక కళాశాలను (మహావిద్యాలయము) స్థాపించెను. ఆసియా ఖండములోనిదియే మొదటిది. ఇందు ఐరోపీయసారస్వతమును, శాస్త్రమును బోధించ సాగిరి. ఆకాలములోనే, ముగ్గురు సెరంపూరు క్రైస్తవమతాచార్యులు 'కారి, మార్షమన్, వార్డు' అనువారు సెరంపూరులో మరియొక కళాశాలను స్థాపించిరి. క్రీ.శ. 1830 లో 'అలెగ్జాండరుడఫ్' అనువాడు 'కలకత్తా'లో మరియొక కళాశాలను స్థాపించెను. పాశ్చాత్య శాస్త్రములను, మతమునకు సంబంధములేని తాత్త్విక సారస్వతమును మన దేశీయులకు బోధించి, వారిని మూఢనమ్మకములనుండి, వెఱ్ఱిభక్తినుండి కాపాడవలెనని, సంఘదురాచారముల నిర్మూలించవలెనని రామమోహనుడు సంతతము ప్రయత్నించెను. 'శ్రేయాంసి బహువిఘ్నాని'అన్నట్లు మంచిపనులు చేయువారికి అనేక విఘ్న

ములు గల్గునుగదా! అభివృద్ధి నిరోధకు లప్పుడు యిప్పుడు ఒకేతలంపులో నున్నారు. ప్రభుత్వమువారింకను, భారతీయుల కేవిద్యావిధానము ఉపకరించునో తేల్చలేదు. సనాతనులు, పూర్వాచార పరాయణులు, సతి ఆచారమును బోగొట్టినందుకు, విగ్రహారాధన, కులభేదముల నిరశించి నందులకు, సంస్కర్తయగు 'రాజారామ మోహానుని'పై కత్తులు దూయసాగిరి. ఆంగ్లేయ విద్యాలయములు వారికి నచ్చలేదు. ప్రాచ్యభాషలు ముఖ్యముగా సంస్కృతభాష బోధించుటకు కళాశాల లవసరమని వారు ప్రభుత్వమును ఒత్తిడి చేయసాగిరి. క్రీ. శ. 1781 లో కలకత్తా మద్రాసా ఒకటి, క్రీ. శ. 1791 లో కాశీ సంస్కృత కళాశాలయొకటి తత్పూర్వమే ఏర్పరచబడెను. అప్పటికింక ప్రభుత్వమువారు, పశ్చిమ దేశీయుల విద్యావిధానము నీదేశీయుల కిచ్చుట కంగీకరించ లేదు. ఇంకను కొన్ని ప్రాచ్యకళాశాలల స్థాపించుచుండిరి. తత్పూర్వము మహారాష్ట్ర ప్రభుత్వమువారు ప్రతివర్షము బ్రాహ్మణ పండితులకు కొంత ద్రవ్యరూపేణ పారితోషికము లొసంగుచుండిరి; బ్రిటిషు ప్రభుత్వమువారుకూడ దీని కంగీకరించిరి. క్రీ. శ. 1821 లో నీపద్ధతికి బదులుగా 'పూనా కళాశాల'ను స్థాపించిరి. క్రీ. శ. 1824లో కలకత్తాలో నొక సంస్కృత కళాశాలను, తరువాత క్రీ. శ. 1829 లో ఢిల్లీలో మరియొక కళాశాలను స్థాపించిరి. క్రీ.శ. 1832 లో ఆగ్రాలో నొక కళాశాల ఏర్పరచబడెను. ఇవియన్ని ప్రాచ్యభాషలనే బోధించుచుండెను.

రామమోహానుడు 'కారి, మార్షమన్, వార్డు, డఫ్' మున్నగు క్రైస్తవ మతాచార్యుల సహాయముతో పాశ్చాత్య

విద్యావిధానమును ప్రవేశపెట్టి దేశీయులకు వెలుగుచూపించ యత్నించుచుండెను. వీరెల్లరొక పక్షము. సనాతనులు రెండవ వైపున వ్యతిరేక ప్రచారమును సాగించుచుండిరి. క్రీ. శ. 1834 లో వీరిరువురికి గొప్ప తగాదా జరుగుచుండెను. ఈష్టు ఇండియా కంపెనీవారు భారతీయుల విద్యకొఱకు ఒక లక్ష రూపాయలు (పదివేల నవరసులు) వ్యయముచేయ తీర్మానించుకొనిరి. భారత దేశములో బదిమంది సభ్యులుగల సంఘ మొకటి ఏర్పాటుచేయబడెను. అందు 5 గురు సభ్యులు పాశ్చాత్య విద్యకు 5 గురు సభ్యులు ప్రాచ్యవిద్యా విధానమునకు అనగా సంస్కృతము, పర్షియా, అరబిక్ భాషలు చదువువారికి వేతనములిచ్చి చదివించుటకు సుముఖులుగా నుండిరి; మంజూరుచేసిన ఈమొత్తము ద్రవ్యమును ఏ విద్యావిధానమునకు ఖర్చుపెట్టవలెనో తేలలేదు. సభ్యులు 10 మంది తగాదాపడిరి. దీనికి రాజీలేదు; వాయిదా వేయుటకు వీలులేదు; అప్పుడే 'మెకాలే' గవర్నరు జనరలు కౌన్సిలు సభ్యుడుగావచ్చి పిమ్మట 'పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ కమిటీ అధ్యక్షుడాయెను. క్రీ. శ. 1832 లో ఇంగ్లాండులోని 'కామన్సు సభవారు', సమర్థులకు, అవసరమైన పరీక్షలలో కృతార్థులైన భారతీయులకు యోగ్యతననుసరించి ఉద్యోగము లివ్వవలసినదిగా నొకచట్ట మంగీకరించిరి. దీనివలన పరిపాలనా వ్యయము కూడ తగ్గునని వారు భావించసాగిరి. 'లార్డ్ విలియం బెంటిక్' అప్పటికి రాజభాషగా నిల్చియున్న పర్షియాభాషను దొలగించి ఆస్థానములో ఇంగ్లీషుభాష నేర్పరచవలెనని తలంచుచుండెను; "ప్రజాభిప్రాయ మంతయు ఇంగ్లీషుభాష కనుకూలముగా నుండెను. ప్రాపంచిక వ్యవహారములకు ప్రాచ్యవిద్యావిధాన

ముపయోగకరము కాదు. ఇది చదువుటకు విద్యార్థులకు ధన మిచ్చి, లంచమిచ్చి తీసికొని రావలసిన గతిపట్టినది." ("The demand was all for English education — Oriental learning did not pay in a worldly sense and students had to be hired or bribed to under take it.") ఈ సమయములో భారతదేశమునకు వచ్చిన 'మెకాలే' భారతీయుల కేవిధమగు విద్యావిధాన మొసగరించు ననువిషయములో క్రీ. శ. 1835-2-2 వ తేదీన యుగయుగ ములు స్మరించదగు ప్రఖ్యాతమైన తీర్పునొసంగెను. దీని నిచట అనువదించుచున్నాను. "నాకు సంస్కృతముగాని అరబిక్ భాషల జ్ఞానముగాని లేదు. కాని ఒక మంచి ఐరోపీయ గ్రంథాలయములోని ఒక బీరువాతో మొత్తము భారతవర్షము, అరేబియాలలోని దేశీయ సారస్వతము అంతకలిపినచో సమ మగునను విషయము ప్రాచ్యదేశీయులలో నెవరును కాదన జాలరు. గొప్ప ఐరోపీయ జాతుల సాహిత్యము లేక కావ్య ములతో అరబ్బీ, సంస్కృతములలోని కావ్యములు పోల్చ వచ్చునని ధైర్యముతో ముందుకువచ్చి చెప్పగలిగినవారు నాకు ప్రాగ్దేశీయులలో రూఢిగా నెవరు కాన్పించలేదు. మానసిక సృష్టిచేత లిఖింపబడిన గ్రంథములనుండి యదార్థ సంఘటన ములు లిఖించబడిన, సామాన్య ముఖ్యసూత్రములు పరిశీలన చేయబడిన గ్రంథములకు బోయినపుడు ఐరోపీయుని ఆధిక్యత పూర్తిగా కొల్చుటకు శక్యముకానిదై యున్నది. ఒక భాష ఉపయుక్తమగు జ్ఞానముకలదికాదని ఒప్పుకొనబడినది. అత్యధి కముగా మూఢభక్తి, వెఱ్ఱినమ్మకము గలదని దీనిని బోధించ వలయును. ఒక తప్పుడుమతములో గలసియున్న కారణమున

తప్పుడుచరిత్ర, తప్పుడు జ్యోతిషము, తప్పుడు వైద్యము మేము బోధించవలయును. అరబ్బీ, సంస్కృతభాషల కంటె ఆంగ్లేయ భాష సర్వవిధముల నేర్చుకొనఁ అర్హత కల్గియున్నది. అజ్ఞానము, అనాగరికతలో మునిగియున్న 'రషియా' సభ్యతా రాజ్యములలో స్థానము గైకొనుటకు 120 ఏండ్లు దీసుకొన్నది.

ఈవిషయ మెట్లు తేల్చవలెను? వారి మాతృభాష ద్వారా ప్రస్తుతము విద్యాభ్యాసము చేయ వీలులేని ఒక జాతిని, విద్యావంతము చేయవలెను. మనము వారికొక విదేశీయ భాష నొసంగవలెను. మన భాషయొక్క యోగ్యతల గూర్చి చెప్పినదానిని మరల సంక్షేపముగా జెప్పవలసిన యవసరము లేదు. పాశ్చాత్య భాషలన్నిటిలో నిది ఉత్కృష్టమైనది. గ్రీకుదేశీయులు వెళ్ళిపోవుచు మాకు అర్పించిన ఉత్తమ గ్రంథములకంటె ఏమాత్రము తీసిపోని మనోకల్పితమగు గ్రంథములు గలవు; అన్నివిధములగు శబ్దచాతుర్యము గల మాదిరి గ్రంథములు గలవు. సాటిలేని నైతిక, రాజకీయ బోధలుగలవని భావించబడినట్టి, వీనికంటె మించిన చరిత్రలు లేవని యనిపించుకొన్న చారిత్రకరచనలు, న్యాయమైన సజీవకళలుగల మానవజీవిత, మానవప్రకృతి ప్రాతినిధ్యము గల్గినట్టి గ్రంథములు, తత్వశాస్త్రము, నీతి, ప్రభుత్వము, ధర్మశాస్త్రము, వర్తకములగూర్చి గంభీరభావములుగల యోచనలుగల రచనలు, ఆరోగ్యమును రక్షించునట్టి, సౌఖ్యమును వృద్ధిచేయునట్టి, మనుజుని బుద్ధబలమును వికసింపచేయునట్టి ప్రతి ప్రయోగాత్మక శాస్త్రమును గౌరవించుచు యిచ్చు సరియైన జ్ఞానముగల గ్రంథములు గలవు. ఎవరైతే ఈ భాషను దెలిసికొందురో వారికి భూమండలము మీాది అన్ని తెలివిగల

జాతులు 90 తరముల క్రితమునుండి సృష్టించినట్టి, నిల్వచేసి నట్టి బ్రహ్మాండమైన బుద్ధిసంపదతో ప్రవేశముగల్గును. 300 ఏండ్ల క్రితము ప్రపంచములోని అన్నిభాషలు కలసినపు డేర్పడిన సారస్వతము కంటె, ఈనాడు ఈభాషలోనున్న సారస్వతము అత్యధికమైన విలువగలదని నిర్భయముగా జెప్పవచ్చును; ఇంతేకాదు; భారతవర్షములో నిది పాలకులచే మాటాడబడుచున్న భాష; ప్రభుత్వస్థానములలో దేశీయులలో ఉన్నతశ్రేణులవారు మాటాడుభాష; ప్రాగ్దేశసముద్రములంతట నిది ప్రాయశః వర్తకభాష కావచ్చును. నూత్నముగా ఉదయించునట్టి రెండు గొప్ప ఐరోపీయజాతుల, అనగా దక్షిణాఫ్రికాలో నొకటి, ఆస్ట్రేలేషియాలో నొకటి,—వీని రెంటియొక్క భాష యిదియేయైయున్నది; ఇవి రెండును ప్రతివర్షము మనకు మరింత ముఖ్యమైనట్టి మన భారతీయ సామ్రాజ్యముతో మరింత సన్నిహిత సంబంధము గల్గినట్టి జాతులై యున్నవి. మన సారస్వతముయొక్క నిజమైన విలువను జూచిన, ఈ దేశముయొక్క ప్రత్యేకమైన స్థితిలేక ప్రదేశమును జూచిన అన్ని విదేశీయ భాషలలో భారతీయులకు అత్యధికముగా నుపయోగపడు భాష ఇంగ్లీషుభాషయేనని తలంచుటకు బలవత్తమమైన కారణము మనకు గాన్పించుచున్నది. ఏవిషయము పైననైన మన గ్రంథములతో బోల్చుటకు అర్హమైన గ్రంథములు ఇతరభాషలలో లేవని విశ్వమంత అంగీకరించినపుడు ఆభాషలు బోధించవలెనా లేక ఈభాషను బోధించుటకు మనకు అధికారమున్నపుడు దీనిని బోధించవలెనా? అనునదియే మనముందు ప్రశ్నమై యున్నది; మనము ఐరోపీయ శాస్త్రములను బోధించగల్గి

నపుడు, ఇతర శాస్త్రములు మనవానికి భిన్నమై అవియే హీనమైనవని విశ్వమంత అంగీకరించినపుడు, ఆశాస్త్రములను బోధించవలయునా? నిజమైన తత్వశాస్త్రమును, నిజమైన చరిత్రను మనము కాపాడుకొనునపుడు గుర్రములకు నాడాలు వేయు ఆంగ్లేయ కుర్రవానికి కూడ అవమానము గల్గించు వైద్యసిద్ధాంతములు, ఆంగ్లేయ బోర్డింగు పాఠశాలలోని బాలికలలో నవ్వు గల్గించునట్టి జ్యోతిషశాస్త్రము, 30 అడుగుల ఎత్తుగల రాజులు, 30 వేల ఏండ్లు పాలించు భూమీశులు గల చరిత్రను, బెల్లము, వెన్నపూసలలో నిండిన సముద్రములుగల భూగోళశాస్త్రమును, ప్రజాద్రవ్యముతో మన మభిమానించవలెనా?

మనకు అన్యులు మార్గము చూపుటకు, అనుభవము లేని వారము కాము. చరిత్ర అనేక సాదృశమైన ఉదాహరణముల నొసంగును. అవియన్ని ఒకేపాఠమును బోధించుచున్నవి. వర్తమాన కాలములో దూరముపోకుండ, రెండు జ్ఞాపకముంచుకొనదగిన దృష్టాంతములు గలవు. కొద్దికాలమువరకు అజ్ఞానములో అనాగరికతలో నున్న దేశములలో కళలు, శాస్త్రములు ప్రతిష్ఠింపబడినవి. ఇపుడు జరుగనున్న కార్యము ఒక గొప్ప సమాజముయొక్క మనసు కివ్వబడిన గొప్ప ప్రేరేపణ, త్రోసివేయబడిన దురభిమానము, వెదజల్లబడిన జ్ఞానము, పరిశుభ్రము చేయబడిన రుచి యగుచున్నవి.

నేనిపుడు చెప్పు మొదటి విషయము 15 వ శతాబ్దాంతములోను, 16 వ శతాబ్దారంభములోను పశ్చిమజాతులలో నున్న గొప్ప పాండిత్య పునరుద్ధరణనుగూర్చియై యున్నది. ఆకాలములో జదువుకొనుటకు తగిన ప్రతివిషయము ప్రాచీన

గ్రీకుల, రోమనుల వ్రాతలలో గాన్పించును. పూర్వము చేసి నట్లుగా, మనపూర్వులు పబ్లిక్ ఇన్స్టిట్యూషన్లను సంఘముగా పని చేసినచో, 'సిసిరో, టాసిటస్' భాషను వారు వదలినచో, మన చిన్నదీవిలోని ప్రాచీన భాషలలో మాత్రమే వారు తమదృష్టిని లగ్నము చేసినచో, విశ్వవిద్యాలయములలో ఆంగ్లోసాక్సనుభాషలో కథలు, నార్మన్ ఫ్రెంచిభాషలోఅద్భుత కల్పిత కథలుకాక వారేమిసూత్రములుగా అచ్చువేయకుండ, ఏమి బోధించకుండ నున్నచో, ఇపుడున్నట్లుగా ఇంగ్లాండు ఉండెడిదా? 'మోరె, ఆశ్చము'ల సమకాలీనులకు, గ్రీకు, లాటిను లెట్టివో, భారతీయులకు మనభాష అట్టిది. ఆంగ్లేయ సాహిత్యము పూర్వకాలపు ఆదిభాషలకు సంబంధించినట్టి దానికంటె ఎక్కువ విలువగలది. సంస్కృత సారస్వతము, పూర్వకాలపు 'సాక్సను, నార్మనుల' సారస్వతముతో తుల్యమైన విలువగలదాయని నేను సందేహించుచున్నాను. కొన్ని శాఖలలో—ఉదాహరణకు చరిత్రలో—వానికంటె చాలహీనమైనదని నేను నిశ్చయముగా జెప్పుచున్నాను.

మన కండ్లముందున్న మరియొక ఉదాహరణముకూడ ఇంకను చెప్పవలసియున్నది. మత యుద్ధములకు పూర్వము మన పూర్వు లెట్లుండెడివారో, అట్లు అనాగరిక స్థితిలోనున్న ఒక జాతి, గత 120 ఏండ్లలో, క్రమముగా అజ్ఞానమునుండి బయల్పడి, సభ్యతగల జాతులలో దనస్థానము నాక్రమించినది. నేను రషియానుగూర్చి మాటాడుచున్నాను. ఆ దేశములో నిపుడు గొప్ప విద్యాధికుల తరగతి కలదు. వారు తమ రాజ్యమును, గొప్పఅధికార పదవులలోనుండి, పాలించుట కర్హులై యున్నారు. పారిసు, లండనులలో ప్రతిభాశాలురైన వ్యక్తుల

కంటె వారు ఏవిధముగాను తీసిపోరు. మాతాత కాలములో పంజాబునకు వెనుకనున్న ఈవిశాల సామ్రాజ్యము భవిష్యత్తులో, మనమనుమల కాలములో అభివృద్ధిలో ఫ్రాన్సు, బ్రిటనుల దగ్గరకుచేరునని ఆశించుటకు కారణముగలదు. ఈ మార్పు ఎట్లు కల్గినది ? జాతీయ దురభిమానముల పొగడుట చేతకాదు. అతని తండ్రులు నమ్మిన ముసలమ్మ కథలతో, యువకుడైన 'మాస్కో' వాసి మనసును నింపుటతో కాదు; 'సెంటునికోలసు'ను గూర్చిన అసత్యపు కథలను, అతనితలలో నింపుటచేతకాదు. సెప్టెంబరు 13 వ తేదీన జగత్తు సృష్టించ బడినదా లేదాయను ప్రశ్నను తేల్చుమని ప్రోత్సహించుట వలనకాదు. జ్ఞానమునకు సంబంధించిన ఈవిషయము లన్నిటిలో ప్రవీణతబొంది నపుడు, అతనిని దేశీయ పండితుడనిపిల్చుట చేతకాదు. బహువిషయిక జ్ఞానమంత నిండియున్న ఆయా విదేశీయ భాషల బోధించినపుడు, అతని యందుబాటులో నీవిషయమంతటిని పెట్టినపుడు, ఈమార్పుగల్గినది. పశ్చిమ యూరోపు భాషలు రషియాను సభ్యతగల దేశముగా జేసినవి. 'టార్టారు' కేమిచేసెనో యాపని, ఇంగ్లీషుభాష హిందువునికి కూడ చేయునను, విషయములో నేనుసందేహించజాలను." (చూడుడు అనుబంధము)

1835 లో బహుముఖ ప్రజ్ఞామూర్తి, మెకాలే యిచ్చిన తీర్పు అత్యంత ప్రాముఖ్యమైన తగాదాను తేల్చివైచెను. విద్వాంసుడగు 'మెకాలే' వాగ్ధాటికి ఆనందమే. కాని అతనికి మన ఋషుల ఇంద్రియ నిగ్రహము, బ్రహ్మచర్యము, యోగము, ఓజశ్శక్తి మున్నగు విషయముల గూర్చి ఏమాత్రము తెలియదు. భౌతికమే ఆయనకు తెలియును. మన

యోగవిద్య, జ్ఞానము విజ్ఞాన శాస్త్రమున కందరానిదని చెప్పుచున్నాను. హిందూదేశపు గవర్నరు జనరలుగానున్న 'బెంటిక్,' తూర్పు పశ్చిమ దేశముల మధ్యవర్తక, పారిశ్రామిక విషయములకు ఆంగ్లేయభాష మిగుల తగియున్నదని భావించెను. భారతీయులకు మహోత్కృష్టమైన నాగరికతను ప్రసాదించుచున్నట్లుగా 'బెంటిక్' తలంచెను. (Gallant type of civilization) 'మెకాలే' ఓటుతో తీర్మానము గెల్చిన తరువాత, 'బెంటిక్' ప్రభువు ఒక నిర్ణయమును చేసి 1835—3—7 వ తేదీన ఇట్లు ప్రకటించెను. "భారతీయులలో ఇంగ్లీషుద్వారా ఐరోపీయ సారస్వతము శాస్త్రములు అభివృద్ధి పరచటమే బ్రిటనుయొక్క గొప్ప ఉద్దేశ్యమై యున్నది. విద్యకై వినియోగించదలచిన అన్నిమూల ధనములు, ఇంగ్లీషువిద్యమీద మాత్రమే వినియోగింపబడవలెను. (Bentick — The Great object of the British Govt. ought to be the promotion of European literature and science among the natives of India and that all the funds appropriated for the purposes of education would be best employed on English education alone.")

ఈవిధముగా రాజా రామమోహనుని కృషివలన, మెకాలే తీర్పువలన, మెట్కాఫ్ ప్రోత్సాహమువలన, బెంటిక్ దీక్షవలన 1835—3—7 వ తేదీన భారత దేశములో ఇంగ్లీషు భాష రాజభాషగా నేర్పడినది. ఇది చారిత్రాత్మకమగు దినము. ఆదినమునుండి ఇంగ్లీషు ప్రాముఖ్యత హెచ్చి దిన దిన ప్రవర్ధమానమగుచు వచ్చినది. అమరజీవి 'రాజా రామ మోహనుని' కలలు తర్వాత ఇలలో నమలుపరచబడినవి.

కాని, ఆమహాత్ముడు ఆంగ్లేయ విద్యాఫలముల కండ్లార కాంచకముందే మరణించెను. సతి ఆచారమట్లనే ఉంచవలసినదని పార్లమెంటుకు సనాతనులు పెట్టిన దరఖాస్తును పార్లమెంటు కొట్టివేసినపుడు స్వయముగా లండనులో ఉండి విని అమందానంద కందళిత హృదయారవిందుడాయెను.

ఈ ఇంగ్లీషుభాషా తీర్మానము అంగీకరించబడినప్పుడు 'సర్ జాన్ లారెన్సు' యిట్లు చెప్పెను. "మా నైతికధర్మ ఆధిక్యతచేత పరిస్థితుల ఒత్తిడిచేత, భగవంతుని ఇచ్ఛచేత మే మిచ్చటఉన్నాము. ప్రజలకు మేలుచేయుటలో, మేము వారి ననుసరించి కాక, మా మనస్సాక్షిగా బంధించబడియున్నాము." ("We are here by our own moral superiority, by the force of circumstances; and in doing the best for the people, we are bound by our own conscience and not theirs." — Sir John Lawrence) క్రీ. శ. 1836 ఆగష్టులో హుగ్లీ కాలేజి తెరచినప్పుడు 1200 మంది పేర్లు మూడుదినములలో నివ్వబడెను. ఆంగ్లేయ విద్యపై విద్యార్థులకు వ్యామోహము అధికమగుచుండెనని, మారుమూలలనున్న వారికి ఇంగ్లీషు చదవ గాఢమైన వాంఛ జనించెనని 'ట్రెవిలియన్' అను లేఖకుడు వ్రాసినాడు. (Sir Charles Trevelyan — "The curiosity of the people is thoroughly roused and the passion for English knowledge has penetrated the most obscure and extended to the most remote parts of India.") ఇది సత్యమే.

సత్యమగు శాస్త్రములపైకి మనసుపోవుట సహజమే కదా!

★

# 4

# ఆంగ్లేయ విద్యాప్రభావము

సదుద్దేశ్యములతోనే 'మెకాలే' ఇంగ్లీషువిద్యను ప్రవేశ పెట్టించెను. దీనివలన అనేక మంచిఫలితములు గల్గెననుటలో సందియములేదు. ఆయన ఇట్లు చెప్పెను. "ఆంగ్లేయ విద్యాభ్యాసము చేసిన ఏ హిందువు తన మతము నంటిపెట్టుకొనియుండడు. విద్యావిషయములో మనముచేసిన ఏర్పాటు ననుసరించినచో, 30 ఏండ్ల తరువాత ఒక్క విగ్రహారాధకుడు కూడ బెంగాలులోని గౌరవనీయ కుటుంబములలో నుండడని నా స్థిరమైన నమ్మకము. అన్యమతములో వారిని ప్రవేశ పెట్టకుండ వారి మతస్వాతంత్ర్య హక్కులలో అణుమాత్రమైన జోక్యము లేకుండ ఇది ఫలించును; కేవలము జ్ఞానము, దాని ఛాయను వ్యాప్తిచేయుట వలననే ఇది గల్గును." నెత్తురు, రంగులో భారతీయులుగా నుందురని, రుచులలో, అభిప్రాయములలో, నీతిధర్మములలో, బుద్ధిలో ఆంగ్లేయుల వలె ఉందురని కూడ 'మెకాలే' ఆశించెను. 'మెకాలే' ఆశించిన కోర్కెలు చాలభాగము ఫలించెను.

క్రీ. శ. 1837 లో పర్షియాభాషను తగ్గించి దాని స్థానములో ఆంగ్లేయభాషను న్యాయస్థానములలో, ప్రభుత్వ కార్యాలయములలో ప్రవేశపెట్టిరి. ప్రతి చదువుకొన్న భారతీయునికి ఇంగ్లీషు ద్వితీయభాష ఆయెను. మతతత్వముతో గూడిన ప్రాచీన భారతీయ భావములకంటె అధికముగా నతనికి పాశ్చాత్య దేశీయుల లౌకిక భావములు, విజ్ఞాన శాస్త్ర

జ్ఞానము, హేతుబద్ధమైన నడక, ఆలోచన సంతృప్తిని గొల్పుచుండెను.

కళాశాలలు, వృత్తి, సాంకేతిక విద్యాలయములు, విశ్వవిద్యాలయముల స్థాపనచేత విశాలభావములు, జీవితములో మార్పు, సాంఘిక సమత్వము గల్గుచుండెను. ఆధునిక విజ్ఞాన శాస్త్రాభ్యసనమున, సారస్వతము చదువుటవలన, భారతజాతీయత ఆరంభమగుచుండెను. ఇంగ్లీషు విద్యావిధానమువలన నూత్నవిజ్ఞాన శాస్త్రసాంప్రదాయములకు ద్వారములు తెరవబడెను. అనేకులు వీనిలో ప్రవీణులైరి. రాష్ట్రభాషాతత్వ సంబంధమగు సంకుచితత్వము దిగజారి, దేశములో ఐక్యత ఒకేభాషద్వారా కల్గుట కిదియే ఆరంభము. భారత దేశములోని ఏమూలవారైన సరే ఒకే భాషద్వారా మాటాడుకొగల్గుచుండెను. ఇది సామాన్యభాష యగుచుండెను. చదువుకొన్నవారి మానసికభావములు మారి, నూత్నమగు కోరికలు, నూత్నభావములు, నూత్నమైన మోజులు అన్నిరంగములలో గాన్పించుచుండెను. మతమాఢ్యము, భక్తిభావము తగ్గిపోయి, స్వతంత్రభావములు గల్గుచుండెను. సమభావము, భ్రాతృభావము, చక్కని సంస్కృతి, మతసహనము గల్గుచుండెను. కులభేదములు తగ్గుచుండెను. వర్ణాంతర వివాహములు, అంతర్వర్ణ భోజనములు హెచ్చుచుండెను. సంస్కరణములందు హెచ్చు అభిమానము గల్గుచుండెను. రాజా రామమోహనుడు, ఈశ్వరచంద్ర విద్యాసాగరులు, వీరేశలింగము మున్నగువారి కాలములో వితంతు వివాహములు, విగ్రహారాధనపై దాడి జరిగినపుడు ప్రథమములో గొప్ప నిరసనగల్గి వారిపై సనాతనులు దాడి

వెడలుచుండిరి; కాని ఆంగ్లేయ విద్యావ్యాప్తి యైనకొలది సంస్కరణములందు అభిమానము హెచ్చగుచుండెను. మెకాలే తండ్రికి వ్రాసిన ఉత్తరములో నిట్లున్నది. "ఆంగ్ల విద్య నేర్చిన హిందువులలో నెవరును తమమతమునందు నిజమైన అభిమానము కలవారుండరు. కొందరు మర్యాదకొరకు తమమత మనుసరింతురు; కొందరు క్రైస్తవులగుదురు. ఆంగ్ల విద్యావిధానము వ్యాపించిన మొదల బంగాళాదేశమున ఉత్తమ జాతులలో విగ్రహారాధకు లుండరని, నాకు గట్టి నమ్మకము." ముహమ్మదుకూడ అరేబియాలో బహుదేవత లందు నమ్మకములు, విగ్రహారాధన కూడదని నిషేధించెను.

రవీంద్రనాథ ఠాగూరు తండ్రి దేవేంద్రనాథ ఠాగూరు, తత్వబోధినీ సభ ద్వితీయ వార్షికోత్సవ సమయమున నిట్లు చెప్పెను; "ఆంగ్లేయ విద్యావ్యాప్తి వలన, అమాయకజనుల వలె, కొయ్యకు, శిలకు దేవుడను అభిప్రాయముతో మనమిక పూజచేయజాలము." ("Owing to the spread of English education we cannot now, like ignorant people, offer wordship to wood or stone, imagining them to be God.") తరువాత ఈ భావములు గల్గిన వెంటనే 'యజ్ఞోపవీతమును గూడ తీసివేసెను.

దేశీయులలో క్రమముగా స్వార్థతతగ్గి, దేశక్షేమము కొరకు పాటుపడవలెనను ప్రయత్నములు హెచ్చుగుచుండెను. ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు, తన దేశీయులు శాస్త్రముల ననుసరించి పోవుటకంటె, స్వార్థపరత్వముతోడనే నడచు చుందురని వ్రాసెను. అట్టిస్వార్థము క్రమముగా తగ్గుచుండెను.

"భౌతికముగా సత్యములన్ని మేము బోధించినాము. భూమి గుండ్రముగానున్నదని, అన్నిచోట్ల సముద్రము ఒకటియేనని, చెప్పితిమి. భూమిపైన సప్తద్వీపములు సప్తసముద్రములు అనగా లవణ, ఇక్షు, సురా. సర్పి, దధి, క్షీర, జలసముద్రములు కలవని చెప్పిన హిందూసిద్ధాంతమునకు విరుద్ధముగా భూగోళ సత్యమునే బోధించితిమి." అని 'మాంటగోమరి' వ్రాసెను.[9] ఇది సత్యముగానేయున్నది. ఇంగ్లీషు భాష ద్వారా సారస్వతము, శాస్త్రముల నేర్చుటచేత జీర్ణమైన, బూజుపట్టిన పాతభావములుపోయి, నూత్నభావ సంపద గల్గుచుండెను. క్రీ.శ. 1823 లో 'హీబరు' 'కులము' అన్నచో అశ్రద్ధగల్గుచుండెనని, భారతీయులు తమ బిడ్డలను, ఇంగ్లీషునేర్చి చదువవలెనను ఇచ్ఛతో తమపాఠశాలలకు బంపుచుండిరని వ్రాసెను.[10] 'న్యూటను' కూడ భారతీయులు, లౌకిక వ్యవహారములలో పశ్చిమదేశీయుల భావములు ఆలోచనలతో పరిచయము గల్గించుకొనుచుండిరని, మత భావముతో కూడిన ప్రాచీన భారతీయుల ఆలోచనలపై దృష్టి తక్కువగానుండెనని వ్రాసెను. ("He became in most cases more familiar with western thought and ideas in secular matters than with ancient Indian thought which always had a religious trend.")[11] ఈవ్రాతలు సత్యముగానే యున్నవి. ముస్లిములు మాత్రము ఈ లౌకిక విద్యావిధానమునకు ఎడముగా నుండి

---

[9] R. Montgomery—The Indian empire P. 18

[10] Heber — Journey III — p. 252–53

[11] N. P. Newton — A hundred years of the British empire.

రని సమస్త విద్యావిధానములో మతమే ముఖ్యకారణమని, అర్థమైనదని వారు భావించుచుండిరని పై లేఖకుడే వ్రాసెను.[12]

ఆంగ్లేయ విద్యావ్యాప్తివలన ప్రజాస్వామిక సూత్రములను దెలిసికొనుచుండిరి; రాజకీయవేత్తలు తయారగుచుండిరి. 'ఠాగూరు, అరవిందుడు, గాంధి ("A politian among saints and a saint among politicians.") వంటి యోగులు, సి. వి. రామన్, జగదీశ చంద్రబోసు వంటి శాస్త్రజ్ఞులు ఆంగ్లేయ విద్యాఫలములే 'సురేంద్రనాధ బెనర్జీ శ్రీనివాసశాస్త్రి, నెహ్రూ మున్నగు వక్తలుకూడ ఈ ఫలములే. వాక్స్వాతంత్ర్యము, పత్రికా స్వాతంత్ర్యము, భావ స్వాతంత్ర్యము అధికమగుచుండెను. పత్రికాధిపతులలో ననేకులు అభ్యుదయభావములు గలవారే. ఈ భావములన్ని విద్యాధికులలోనే వ్యాపించుచున్నవి కాని, ఆంగ్లేయ విద్య రుచిచూడని వారిలో మతమాఢ్యము అధికముగానుండె ననుటలో సందియములేదు. మేధస్సు వృద్ధికానందువలన, చారిత్రక సత్యాన్వేషణ చేయజాలకుండిరి. ఆంగ్లేయ విద్యావ్యాప్తివలన సంస్కరణములు కల్గెను. ధూమశకటములు, టెలిగ్రాఫు తీగలు ముద్రణాయంత్రములు మున్నగునవి విపులమైన ప్రచారములోకి వచ్చెను. పారిశ్రామిక విప్లవ ఫలితములుకూడ మనగడ్డకు సోకెను. వీనివలన నూత్న భారతవర్ష మేర్పడుచున్నది. ఈసంస్కరణలు సనాతనులకు, పూర్వాచార పరాయణులకు నచ్చలేదు. మతమాఢ్యముగలవారికికూడ, లౌకికసంబంధమగు ఆంగ్లవిద్యావిధానము నచ్చలేదు. జాతీయ భావముతో కాకుండా, మతదృష్ట్యా

[12] Ibid — p. 325.

క్రైస్తవ రాజపాలన సాగుచున్నదని హిందూముహమ్మదీయ పాలన అడుగంటినదని తలంచిరి. క్రీ.శ, 1857 లో సిపాయి విప్లవముగూడ చెలరేగినది. "డాల్హౌసీపాలన పద్ధతి విఫల మాయెను. కారణమేమన ప్రజలు, వెలుగుకంటె అంధకార మును, తెలివి తేటలుకంటె తెలివితక్కువ తనమును అధిక ముగా గోరుకొనుచుండిరి," అని సమకాలీన విద్వాంసులు వ్రాసిరి. [13] ఇదిసత్యమనియే తోచుచున్నది. అధికార వాంఛతో కాకుండా జాతీయ భావములతోగూడిన, నిజమైన భారత స్వాతంత్ర్య సమరమేయైనచో, చాలసంతోషించ తగ్గదే.

హిందూమత సిద్ధాంతములన్ని, వేదశిరసు, వేదసారము వేదాంతము' అనిచెప్పబడు ఉపనిషత్తులలో గాన్పించు చున్నవి. ప్రపంచములో నేదేశములోను ఆకాలమున బ్రహ్మచర్య వ్రతప్రభావమును, ఓజశ్శక్తిని, ఇంద్రియ నిగ్రహమును యోగమునుగూర్చి ఎరింగినవారు లేరు. ఆర్య ఋషులే ఈ దివ్యసందేశమును ప్రప్రథమముగా ప్రపంచము నకు చాటినారు. వీనిని గనుగొనుటకు ఋషులు కందమూల ఫలాదులుతిని, అరణ్యములో నేకాంత జీవితమును గడుపు చుండిరి. వీరు స్వార్థరహితులు, కాని అనంతర కాలముల వారు హిందూమతమును స్వప్రయోజనములకు వినియోగించ సాగిరి. ప్రాణశక్తిని, దివ్యకళలను గల్గించు బ్రహ్మచర్యము నిర్జనారణ్యావాసము, సాత్వికాహారము పోయి కర్మకాండ,

---

[13] Kay and Malleson — History of mutiny vol I P.263 'Lord' Dalhousi's system failed perhaps only because the people prefered darkness to light, folly to wisdom.'

ఆచారములు, విపరీతముగా పెరిగిపోయిన కులతత్వవాద ముతో హిందూమతము బరువెక్కిపోయినది. ("Great handicap of Hinduism — load of ritualism and ceremonial observances, caste developed to fantastic length" ("See U. P. Hist. society—Vol XIX—A new approach — D. P. Saran M. A. "Now it is noteworthy that while the priesthood had fully succeeded in enslaving the people in chains of a net work of ritualism and superstitions, miscalled religion. — The priesthood were generally the most unbending, irrational and intolerant and they were the intellectual guides of a credulous laity.") హిందువుల పవిత్ర గ్రంథజాలము లన్నీ సీళ్ళువేసిన గ్రంథములై, కొందరు చదువుటకు, వినుటకు వీలులేకుండెను. స్త్రీస్వాతంత్ర్యము లేదు, స్త్రీలుకూడ వీనిని జదువనోచుకొన రాదాయెను. అట్టిసమయములో పాశ్చాత్యులు మన దేశమునకు వచ్చి ఆయా భాషలను సమగ్రముగా జదివి వానిని ఇంగ్లీషు లోని కనువాదముచేసి, మాతృకలైన యాగ్రంథముల మన కందజేసిరి. మన సంస్కృతి, నాగరికత బయల్పడినది. అనేక శాసనముల, స్థూపముల, విహారముల, నాణె ముల, కైఫీయతుల బయటపెట్టి సమకాలీన విదేశీయ లేఖకుల వ్రాతలను అనువాదముచేసి నిజమైన చరిత్ర వ్రాయసాగిరి. చారిత్రక సత్యాన్వేషణ, భూగోళశాస్త్ర జ్ఞానము శాస్త్రీయ దృక్పథముతో పరిశోధనలు, ఆరంభ మాయెను. విజ్ఞానశాస్త్రాభివృద్ధివలన సాంఘిక దురా చారములు చాలభాగము నిర్మూలింపబడుచుండెను. అనేక

రకముల కళాశాలల వలన కళలు సమస్తశాస్త్రములు అనగా వైద్యము, ఇంజనీరింగు, భూగర్భశాస్త్రము, జంతుశాస్త్రము, వృక్షశాస్త్రము, జీవ, రసాయన, భౌతికశాస్త్రములు, రాజనీతిశాస్త్రము, న్యాయశాస్త్రము, మున్నగు సమస్త శాస్త్రములు, కూలంకషముగా నేర్పుటచేత, శాస్త్రీయ భావములు చిత్తంబున హత్తుకొని, పోయినవి. దేశముకూడ అభివృద్ధికాసాగెను. 'గోపాలకృష్ణ గోఖలే' యిట్లునుడివెను. "మీశాంతివలనగల్గు దీవెనలు, శాసనములలో క్రమపద్ధతి పశ్చిమదేశ విద్యావిధానమును ప్రవేశపెట్టుట, వాక్స్వాతంత్ర్యము, సర్వవిషయ జ్ఞానమును ప్రసాదించు విద్యాలయములు ఇవిఅన్ని మీరాచరికముయొక్క గణ్యతను జూపుచున్నవి."(Gokhale — "The blessings of peace, the establishment of law and order, the introduction of western education and the freedom of speech and appreciation of liberal institutions that have followed in its wake — all these are things which stand to the credit of your rule.") 'దత్తు, జమునాథ సర్కారు, రెనడే' మున్నగు విద్వాంసులందరు నిష్పక్ష పాతబుద్ధితో బ్రిటిషువారి శాంతి భద్రతలను, విద్యావిధానమును బహు విధముల ప్రశంసించిరి. సంస్కృత విద్యావిధానము వలన గల్గిన అనైక్యత, కులవిద్యలు, మత యుద్ధములు తగ్గిపోయి, సహావభావము అధికమగు చుండెను. 3000 కులములు 3000 ఉప కులములలోని హెచ్చు తగ్గుల గూర్చి ఎవరు యోచించరు. బౌద్ధ, జైన గ్రంథములన్ని ఇంగ్లీషులోని కనువాద మగుటచేత, ప్రాచీన భారతీయ సంస్కృతి, సభ్యత అన్ని బయటకువచ్చి, పరిశోధన కవకాశ

ములు జిక్కెను. ప్రాచీన భారతవర్షము ఏలపడిపోయి, విదేశ
పాలన క్రిందకు వచ్చెనో, మూలకారణములన్ని తెలిసి పోయి
నవి. జాతీయ అంతర్జాతీయ భావములు గల్గినవి. రామ రాజ్య
ములో కూడలేని, అందరికి సరిసమానావకాశములు (Equal
opportunities for one and all) అను నినాదము బయలు
దేరినది. "పర్షియా దేశపు రాజగుటకంటె, నేను ఒక
శాస్త్రీయ విషయమును గనిపెట్టెదను" ("I would rather
discover one scientific fact than become king of
Persia,") అను సత్యము కొరకే ప్రతివారు ప్రయత్నించ
సాగిరి. చరిత్రయందు ప్రాచీన భారతీయులకు మక్కువలేదని
దేనికి కాలనిర్ణయము చేయలేకుండిరని, గట్టిగానొక్కి అడిగి
నచో ఏమి చెప్పుటకు చేతకాక, కల్పితగాథలను చెప్పుచుండి
రని గజనీ మహమ్మదుతో వచ్చిన 'అల్బరూని' వ్రాసెను.
ఇది సత్యమే. మన పూర్వులు చరిత్ర, భూగోళశాస్త్ర రచ
నకు బూనుకోలేదు. ఆంగ్లేయ విద్యా విధానము వలన
సత్యమగు చరిత్రలేవియో తెలిసినవి. ప్రక్షిప్తములు కల్పిత
భాగములేవి? ఏయే కాలములలో నెట్లెట్లు, ఏలచేర్చిరి? ఇట్టి
నూత్న భావములన్ని విద్యాధికులలో గల్గినవి. ఎట్లు, ఎందుకు
(How and why) అను ప్రశ్నలుదయించు చుండెను.
అట్లనే భూగోళ శాస్త్రజ్ఞానము గల్గినది. అన్ని విధములగు
స్వాతంత్ర్యతా భావములగాలి, పశ్చిమదిశనుండియే, తూర్పు
వైపుకు వీచినదని, 'ఠాగూరు' వ్రాసెను. ("Europe has
introduced to the east, through the smoke of
cannon and the dust markets, the idea of freedom
in all directions, the idea of moral freedom,
freedom of conscience, freedom of thought and

action, freedom from bondage in literature and art") ఈవ్రాత సత్యముగానే యున్నది. ఈదేశ పరిస్థితులకు, కాలానుగుణ్యముగా చక్కని విద్యావిధానము ప్రసాదింపబడినదని 'ఠాగూరు' చెప్పెను.

ఈనూత్న విద్యావిధానమువలన విచారణ, విమర్శన, మతముమీద పౌరోహిత్యముమీద ఏహ్యాభావము, హేతుబద్ధముకాని విషయములను విమర్శించుట, మధ్యకాలీన సనాతనాచార పద్ధతులవలన గల్గిన సంకుచిత మానసిక నిరోధముల భేదించుట అనునవి గల్గెనని శివనాథశాస్త్రి అను విద్వాంసుడు వ్రాసెను. ఇది సత్యముగా నున్నది. (Among the charecteristic features of the new movement may be included (a) A spirit of enquiry and criticism. – A great hatred against priesthood and religion – They criticised whatever came in their way and against reason – Shattered the narrow mental barriers imposed by madiaeval orthodoxy.") [14]

స్త్రీలకొరకు ప్రత్యేకముగా ఆంగ్లవిద్యాభ్యాసనమునకు అనేక విద్యాలయములు, కళాశాలలు స్థాపించబడెను; ధీశాలియగు 'రామమోహనుడు' స్త్రీవిద్యా విధానమును ప్రోత్సహించెను. వితంతువివాహములు, స్త్రీవిద్య, వర్ణవ్యవస్థ అను వానిపైన కనివినిఎరుగని గొప్ప సంస్కరణము లారంభమాయెను. వీనియంతటికి కారణము ఆంగ్లవిద్యవలన గల్గిన

---

[14] Sivanatha Sastry — Proceedings of the Indi. Hist. congress. Allahabad II – 1938.

సంస్కరణ భావములే. (T. K. Datta – "It is only English education which is responsible for this change of our national mind.") ముఖ్యముగా భారతీయ సమాజమునకు జ్ఞానవృద్ధి' (Enlightenment) విశాల మానసిక భావము (Broadmindedness) కల్గినదని, పతితమైన భారతీయ సమాజము ఉద్ధరించడమైనదని, మానసిక, సాంఘిక దాస్యమునుండి విముక్తి కల్గినదని, సంస్కరణము, నూత్న విజ్ఞానము లౌకికదృష్టి గల జాతులతో సంబంధము గల్గినందున మనపరిసరము మారి, దాని ప్రభావము మనపైన సోకినదని చెప్పవచ్చును. ఇంగ్లీషుఅనుజాతీయ ద్రవ్యమును భారతీయులు ఎన్నటికి పోగొట్టుకొనరాదు.

అనేకమంది పండితులు ఇరువదవశతాబ్దములో ఉదజని బాంబుయుగములోగూడ పలు తెరగుల వ్యాఖ్యానములు చేయుచున్నారు. ఇవి లౌకికమునకు, పారలౌకికమునకుకూడ ఉపయోగించెడివికావు. కేవలము స్వార్థమునకు ఉదరపోషణార్థ ముపయోగించును; ఒక కవి రచించిన ఈ శ్లోకము చూడుడు.

"శ్లో॥ వాగ్వైఖరీ శబ్దఝరీబుద్ధి భ్రమణ కారణం
వైదుష్యం విదుషాంత ద్వద్భుక్తయే నతుముక్తయే॥"

తా. బుద్ధినిభ్రమింపజేయు అనేక వాక్ప్రయోగములు, పలు తెరగుల వ్యాఖ్యానములుచేయు సామర్థ్యము, పండితుల కూటికొరకేకాని ముక్తికొరకుకాదు,

ఇపుడు ప్రజాస్వామికము ఆచరణలోకలదు. "ఎక్కువ మంది చదువలేనిచో ఈ రూపములో ప్రజాస్వామికము పూర్తిగా అసాధ్యమగుచున్నది." అని 'రస్సెల్' నుడివినాడు. (Russell–"Democracy in its modern form would be quite impossible in a nation, where many men cannot read.") ఈచదువు మూఢనమ్మకములతో, వెట్టి భక్తిలో కూడినదికాక, విమర్శనాత్మకమై, ఆధునిక ప్రపంచమునకు సరిపోవునదై, హేతుబద్ధమై, శాస్త్రసమ్మతమై యుండవలెను. 'డా. డియో లోవిస్' (Dr Dio Lovis) "బ్రహ్మచర్యము, శరీరమునకు మనసుయొక్క చురుకుతనమునకు, బుద్ధితీక్ష్ణతకు, చాలముఖ్యమైనది" అని చెప్పెను. ఇదిసత్యమే. ఆధునికవిద్యావిధానములో దీనిని కలిపిమనవిద్యా విధానమును ఉత్కృష్టమైన దానినిగ జేయవలెను. 'కిప్లింగు' వచనమును ఒకసారి జ్ఞప్తియందుంచు కొనుడు. తూర్పు తూర్పే, పడమర పడమరయేయై యున్నది; కాని ప్రాక్పశ్చిమములు కలసిన ఉత్తమ మగునను సూక్తి మరవరానిది.

"East is east, West is west,
East plus west, will make the best."
–(Kippling)

ఆధునిక విద్యావిధానములో మనోనిగ్రహము కాన్పించడము లేదు. ('Self control is a thing unknown in it.') అందుచేత రెండు కలసిన విద్యావిధానము ఉత్తమము; స్వామి 'వివేకానంద' కూడ యిట్లు నుడివినాడు "గ్రామ గ్రామములకు మతబోధకేగు సన్యాసులు, లౌకిక జ్ఞానమునుగూడ ప్రసాదించవలెను. ఒక కెమేరా, ఒక గ్లోబు, కొన్ని దేశ

పటములు తీసికొని యిరువురు ఒక సాయంకాలము ఒకగ్రామ మున కేగిన, వారు విస్తారముగా జ్యోతిషశాస్త్రము, భూగోళ శాస్త్రము గ్రామీణులకు బోధించకలరు. వేరువేరు జాతుల గూర్చినకథలు చెప్పుచు వారు గ్రామీణులకు విశేషమైన వృత్తాంత మివ్వవచ్చును. వారికి చరిత్ర, భూగోళశాస్త్రము, విజ్ఞానశాస్త్రము, వాఙ్మయము బోధించుచు, వీనితోబాటు మత సత్యములను బోధించవలెను.'' రామతీర్థ కూడ యిట్టి సందేశమునే యొసంగెను. లౌకిక ప్రజాస్వామికము కాన స్వకీయ సంబంధమగు మతమును రాజకీయముతో ముడిపెట్ట రాదు. ఇంగ్లీషు అంతర్జాతీయ భాష, ప్రపంచభాషయై యున్నది. ప్రపంచములోని ఏ దేశముతోనైన సంబంధము పెట్టుకోవలెనన్న ఇంగ్లీషు అవసరము. ఏ పరిశోధనాగ్రంథము చూడవలెనన్న ఇంగ్లీషుభాష అవసరము. స్వరాజ్యానంత రము మనవారు అప్పుడే గతించిన 10 ఏండ్లలోనే ఇంగ్లీషును పార తోలినచోగాని నిజమైన జాతీయత ఏర్పడదని సంస్కృ తమే మన సంస్కృతికి మూలమని, ఇంగ్లీషు స్థానములో సంస్కృతము పెట్టుడని ప్రచారము చేయుట విచారకరము. వీరు బోధించునది అంధకార బంధురంబైన, మత భావ పూరిత మైన జాతీయతయేకాని (**Obscurantist religious nationalism**) అన్యముకాదు. దీని ననుసరించినచో చరిత్ర పునశ్చరణ యగును. (**History repeats itself**) ప్రజా స్వామికము సఫలీకృతము కావలెనన్న, విజ్ఞానశాస్త్ర మవస రము; (**Russell–And without science democracy is ;mpossible**) అది కావలెనన్న ఆంగ్లేయభాష అవసరము. ఇవి ఓతప్రోతములై, విడదీయుటకు వీలులేని సంబంధము

గలవై యున్నవి. ప్రపంచమొక వంక, మనమొక వంక పోయిన, మన మేకాకులమై పోదుము. జర్మనీ, రషియా, జపానులలో గూడ ఆంగ్లేయభాష, ద్వితీయ నిర్బంధ భాషవై వెలయుచున్నది. సామ్రాజ్య వాదమును, వలసరాజ్య విధాన మును భారతీయు లేవగించు కొనుటలో నర్థమున్నది; కాని ఆంగ్లేయ భాషా ప్రాముఖ్యతను తగ్గించుటలో నర్థములేదు; ఈ విద్య పోవుట వలన, క్షీణించుట వలన, అభ్యుదయ భావ ములు, ప్రపంచ జాతులతో భారతీయులకుగల సంబంధములు ప్రపంచ కవాటములు మూయబడి నట్లేయని యూషిగా చెప్ప వచ్చును. "మనము హేతుబద్ధముగా ప్రతివిషయము శాసించబడ వలెననిదానినట్లు ఏర్పాటుచేయవలెననికోరుకొనుచున్నాము." అని ఒక రచయిత వ్రాసినాడు. ("We want everything te be arranged according to the dictates of our human reason.) అన్ని విషయములు శాస్త్రీయములు అట్లనే ఆంగ్లేయభాషలో ఏర్పాటు చేసినపుడు, దీనినేల వర్జించవలెను? అందుచేత ఈవిద్యా ప్రాముఖ్యతను గుర్తించ వలసినదిగా చెప్పుచున్నానుకాని మాతృభాష, జాతీయభాషల ఆధిక్యతను కూడ పోగొట్టరాదు, ఈమూడుభాషలందునాకు సమభావ మున్నది. ఏదేశము శాస్త్రములో గొప్పదగునో అదియే వర్తమాన కాలములో బలవంతమైన దేశమగునని, 'నెహ్రూ పండితుడుకూడ నుడివియుండెను. పరిపూర్ణమైన విజ్ఞాన శాస్త్ర జ్ఞానములేనిచో, నవ్యభారతావని కాజాలదు. పాశు పతాస్త్రములు, బ్రహ్మాస్త్రములు, ఆగ్నేయాస్త్రములు గల వని మనవారు నిద్రించుటచేతనే, దేశము పరాధీనమైపోయి నది. 'అలెగ్జాండరు' కాలములో శక, హూణ కుషాణుల

దండయాత్రలలో రామరాజుకాలములో, బొబ్బిలి వీరుల కాలములో నీయస్త్రి, శస్త్రి సంచయములు, మంత్ర తంత్ర ములు ఏమైనవో తెలియకున్నది. ఇట్టిఛాందస భావములకు సాంఘిక దురాచారములకు విరుగుడు శాస్త్రిజన్యజ్ఞానమే యని చెప్పుచున్నాను. భారతీయులు దీనిని వదలినచో, పూర్వమువలె కూపస్థమండూకములగుట నిశ్చయము. వెను కటి ఛాందసము తిరిగితలఎత్తునేమోయని నాయుల్లంబు పెల్లుగ తల్లడిల్లుచున్నది: ఆంగ్లభాషా వ్యామోహమున నేనీపల్కు-లు పల్కుటలేదు. దేశశ్రేయస్సు రీత్యాను భారతీయ సంస్కృ తిలో శాస్త్రిదృక్పథము, చరిత్ర, భూగోళము, విమర్శనసరిగా లేనందువలన నేనీవిషయముల్లేఖించితిని. దీనిని గుర్తింతురని వేడుచున్నాను.

ఆధునిక భారతీయ విద్యావిధానము బ్రిటిషుపాలన వలన గల్గిన గొప్ప మేళ్ళలో నొకటి. ("Modern Indian education, the greatest benefit of British rule") సమిష్టి దేశశ్రేయస్సు రీత్యా దీని నాలోచించి సంస్కర్త సారస్వతధీమణి (Literary genius) విద్వాంసుడు, బహు ముఖ ప్రజ్ఞావంతుడు, విమర్శకాగ్రణి, అనేకభాషలను జవి చూచిన పండితుడు అయిన 'రాజా రామమోహనుడు' తరచి, తరచి తేల్చిన సమస్యను, మరల మొదలెత్తుకొనుట సమంజసముగా లేదని నేనభిప్రాయపడుచున్నాను; ఇంకను ఈవిధానమునకు దోడుగా ఈపునాదికి భిన్నముగాకుండా వృత్తి సాంకేతిక విద్యలను గూడ నేర్పించి త్వరలో ప్రభుత్వము నిరుద్యోగ నిర్మూలనకు దోడ్పడునని ఆశించుచున్నాను.

★

## RAMAMOHAN'S LETTER

### TO THE GOVERNMENT OF INDIA

("We find that the Govt. are establishing a Sanskrit school under Hindu Pandits to impact such knowledge as is already current in India. This seminary can only be expected to load the mind of youth with Grammatical niceties and metaphysical distinctions of little or no practical use to their possessors or to society. The pupils will there acquire what was known 2000 years ago, with the addition of vain and empty subtelities since then produced by speculative men such as is already commonly taught in all parts of India. The Sanskrit language was so difficult that almost a life time was required for its acquisition, — the learning concealed under this almost impervious veil, is far from sufficient to reward the labour of acquiring it. If it was necessary to perpetuate the language, it would be better to sudsidise Pandits who existed in all parts of the country with premiums and allowances than to establish a new Sanskrit college. — Nor will youths be fitted to be better members of society by the Vedantic doctrines which teach them to believe that all visible things have no real existence, that as father, brother etc. have no actual entity, they consequently deserve no real affection, and therefore the sooner we escape from them and leave the world, the better.- The Sanskrit system of education would be the best calculated to keep the country in darkness, if such had been the policy of the British legislature."—To enrich our languages, it is necessary to study English and acquire greater knowledge.—But as the improvement of the native population is the object of the Govt. it will consequently promote a moral liberal and enlightened system of instruction, embracing Mathematics, Natural philosophy, chemistry, anatomy, with other useful sciences which may be accomplished with the sums Proposed, by employing a few gentlemen of talents and learning, educated in Europe and providing a college, furnished with necessary books, instruments and other apparatus. — 'Teaching of science would help to abolish certain social evils in the Hindu system."

# FAMOUS SPEECH OF MACAULAY

"I have no knowledge of either Sanskrit or Arabic. But I have never found one (among the orientalists) who could deny that a single shelf of a good European library was worth the whole native literature of India and Arabia. I certainly never met with any orientalists who ventured to maintain that the Arabic and Sanskrit poetry could be compared to that of the great European nations. And when we Pass from works of imagination to works in which facts are recorded and general principles investigated, the superiority of the European becomes absolutely immeasurable."

It is confessed that a language is barren of useful knowledge. We are to teach it because it is fruitful of monstrous superstitions. We are to teach false history, false astronomy, false medicine, because we find them in company with a false religion." English was better worth knowing than Sanskrit or Arabic. Russia within a 120 years had emerged from the ignorance and barbarism in which it was sunk to take its place among civilized communities."

"How stands the case? We have to educate a people who cannot at present be educated by means of their mother-tongue. We must teach them some foreign language. The claims of our own language it is hardly necessary to recapitulate. It stands pre-eminent even among the languages of the West. It abounds with works of imagination not inferior to the noblest which Greece has bequeathed to us; with models of every species of eloquence; with historical compositions, which, considered merely as narratives, have seldom been surpassed, and which, considered as vehicles of ethical and political instruction, have never been equalled; with just and lively representations of human life and human nature; with the most profound speculations on metaphysics, morals, government, jurisprudence, and trade; with full and correct information respecting every experimental science which tends to preserve the health, to increase the comfort, or to expand the intellect of man. Whoever knows that

language has ready access to all the vast intellectual wealth which all the wisest nations of the earth have created and hoarded in the course of ninety generations. It may safely be said that the literature now extant in that language is of far greater value than all the literature which three hundred years ago was extant in all the languages of the world together. Nor is this all. In India, English is the language spoken by the ruling class. It is spoken by the higher class of natives at the seats of government. It is likely to become the language of commerce throughout the seas of the East. It is the language of two great European communities which are rising, the one in the south of Africa, the other in Australasia; communities which are every year becoming more important, and more closely connected with our Indian Empire. Whether we look at the intrinsic value of our literature or at the particular situation of this country, we shall see the strongest reason to think that, of all foreign tongues, the English tongue is that which would be the most useful to our native subjects.

"The question now before us is simply whether, when it is in our power to teach this language, we shall teach languages in which, by universal confession, there are no books on any subject which deserve to be compared to our own; whether, when we can teach European science, we shall teach systems which, by universal confession, whenever they differ from those of Europe, differ for the worse; and whether, when we can patronise sound philosophy and true history, we shall countenance, at the public expense, medical doctrines, which would disgrace an English farrier — astronomy, which would move laughter in the girls at an English boarding-school—history, abounding with kings thirty feet high, and reigns thirty thousand years long—and geography made up of seas of treacle and seas of butter.

"We are not without experience to guide us. History furnishes several analogous cases, and they all teach the same lesson. There are in modern times, to go no further, two memorable instances of a great impulse given to the mind of a whole society — of prejudice overthrown — of knowledge diffused—of taste purified—of arts and sciences planted in countries which had recently been ignorant and barbarous.

"The first instance to which I refer is the great revival of letters among the western nations at the close of the fifteenth and the beginning of the sixteenth century. At that time almost everything that was worth reading was contained in the writings of the ancient Greeks and Romans. Had our ancestors acted as the Committee of Public Instruction has hitherto acted: had they neglected the language of Cicero and Tacitus; had they confined their attention to the old dialects of our own island; had they printed nothing, and taught nothing at the universities, but chronicles in Anglo-Saxon, and romances in Norman French, would England have been what she now is? What the Greek and Latin were to the contemporaries of More and Ascham, our tongue is to the people of India. The literature of England is now more valuable than that of classical antiquity. I doubt whether the Sanscrit literature be as valuable as that of our Saxon and Norman progenitors. In some departments — in history, for example — I am certain that it is much less so.

"Another instance may be said to be still before our eyes. Within the last hundred and twenty years a nation which had previously been in a state as barbarous as that in which our ancestors were before the Crusades, has gradually emerged from the ignorance in which it was sunk, and has taken

its place among civilised communities. I speak of Russia. There is now in that country a large educated class, abounding with persons fit to serve the state in the highest functions, and in no wise inferior to the most accomplished men who adorn the best circles of Paris and London. There is reason to hope that this vast Empire, which in the time of our grandfathers was probably behind the Punjab, may, in the time of our grandchildren, be pressing close on France and Britain in the career of improvement. And how was this change effected ? Not by flattering national prejudices; not by feeding the mind of the young Muscovite with the old woman's stories which his rude fathers had believed; not by filling his head with lying legends about St. Nicholas; not by encouraging him to study the great question, whether the world was or was not created on the 13th of September; not by calling him 'a learned native,' when he has mastered all these points of knowledge; but by teaching him those foreign languages in which the greatest mass of information had been laid up, and thus putting all that information within his reach. The languages of western Europe civilised Russia. I cannot doubt that they will do for the Hindoo what they have done for the Tartar."—

'It may be that the public mind of India may expand under our system till it has outgrown that system; that by good Government we may educate our subjects into a capacity for better government; that, having become instructed in European knowledge, they may, in some future age, demand European institutions. Whether such a day will ever come I know not. But never will I attempt to avert or to retard it. Whenever it comes, it will be theproudest day in English history.'

★

Bharat Sevek Samaj
*President :*
JAWAHARILAL NEHRU

*National Head Quarters*
NEW DELHI,
*Oct 24, 1952*

*Dear friend,*

I thank you for your letter dated 14th October, 1952, addressed to Shri Jawaharilal Nehru.

I am happy to note that you have a genius for writing work. We shall certainly contact you as and when we need your services. In the meanwhile you can forward your articles on Community projects etc. to this office, if you so desire.

*Shri*
K. L. NARAYANA *B. A.*,
MOPARRU

*Yours in service*
(Sd.) N.L. VARMA
*Administration Secretary.*

*On the receipt of 'Nehruism Interpreted'*

HOUSE OF COMMONS,
LONDON S. W. 1
24th October, 1951

*Dear* MR. NARAYANA,

I am writing on behalf of Mr. Churchill to acknowledge the two copies of your book which you sent him.

YOURS SINCERELY,
*(Sd)*.................
Hon. Secretary

2. WILTON, CRESCENT.
LONDON, S. W. 1.
25th October, 1951

*Dear* MR. NARAYANA,

Thank you for sending my wife and myself a copy of "Nehruism Interpreted" which we are very glad to have.

YOURS SINCERELY;
(*Sd*)..................
Mountbatten of Burma.

# BIBLIOGRAPHY

*Mc Crindle J. W.*—1 The Indika of Megasthenes and Arrian. 2 Ktesias Indika 3 Ancient India as described in the classical literature. 4 The Invasion of Alexander the Great. 5 Periplus of the Erythrean Sea.

*V. A. Smith* —Early History of India.
Oxford History of India.

*C. S. Srinivasachary* — History of India.

*R. K. Mukerjee* — Hindu civilization.

*Rapson etc.* — Cambridge History of India–6 vol.

*Rhys Davids* — Buddhist India.

*Ray Choudary*—Political history of Ancient India.

*R. C. Dutit* — Ancient India.
— India in the Victorian age.

*Manual Komroff* — The travels of Marcopolo.

*Cowell* — Jataka tales 6 vol.

*Maxmuller etc* — Sacred books of the East.
All volumes

*T. Watters* — On Yuan chwang's travels 2 vol.

*Samuel Beal* — Life of Hiuen Tsiang (Hwiu Li)

*J. Takakusu* — (Itsing) — A record of the Buddhist religion as practised in India and the Malaya Archipelago.

*Dr E. Sachuva* — Alberuni's India.

*Weber* — The history of Indian literature.

*M. Winternitz* — „ 2 vol.

*M. M. William* — Indian wisdom.

*Rev. F. E. Keay* — A history of Ancient Indian Education.

*N. N. Mazumdar* — A history of education in Ancient India,

*N. N. Law* — Promotion of learning in India.

*R. N. Mehta* — Pre Buddhist India.

*J. N. Sircar* — India through the ages.

*Dr D. Jivanayakam* — The theory and practice of education.

*T. K. Datta* — What English education has made of us.

*Ananthanadh Basu*—University education in India.

*G. Thompson* — British rule in India.

*Sankalia* — The university of Nalanda.

*Macaulay* — Essays 2 parts.

*Trevelyan* — Life of Macaulay.

*Mulk Raj Anand* — On education.

*Betrand Russell* — On education.

*R. Montgomery* — The Indian empire.

*A. P. Newton* — A 100 years of the British rule.

*A. Yusuf Ali* — A cultural history of India.

*Miss Corner* — India.

*Thomas Keightley* — History of India.

*C. H. Eden* — India—Historical and descriptive.

*Campbell G* — Modern India.

*G. N. Singh* ... Indian states and British India.

*B. C. Law* — Early Indian culture.
B. C. Law volume

*G. Thompson* — British rule in India.

*R. Heber* — Narration of journey through upper provinces of India.

A. B. O. R. I Volumes etc.